ఆంధ్ర

# కాదంబరి

(ఉత్తరార్ధము)

గ్రంథకర్త

పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు.

వెల రు. ౧.

గుంటూరు, చంద్రికా ముద్రాశాలయందు ముద్రితము

# ఆంధ్ర

# కాదంబరి

## ( ఉత్తరార్ధము )

గ్రంథకర్త

పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు.

వెల రు. ౧.

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రితము

# ఆంధ్ర కాదంబరి

## (ఉత్తరార్ధము)

గ్రంథకర్త

పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు
గర్తపురోన్నతపాఠశాలా
ప్రధాన సంస్కృతోపాధ్యాయులు.

ఇయ్యది

గుంటూరులోని సుప్రసిద్ధ న్యాయవాదులగు
శ్రీయుత ఏకా దండయ్య పంతులుగారి
పరిపూర్ణ ద్రవ్యసాహాయ్యమున

గుంటూరు
చంద్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది

1934



[వెల రు 1-0-0

# పీఠిక

ఉభయసాహిత్యసంపన్నులు ననేకకృతికర్తలు నగు మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు రచియించినయాంధ్ర కాదంబరి యనెడియీ కావ్యమున కీకాలమందలిగ్రంథావిష్కరణాచారము కారణముగా వారు నాకుఁ గలిగించిన యవకాశమునుబట్టి పీఠిక యనుపేర నాలుగు మాటలు వ్రాయుటకు ముందు మూలకాదంబరీప్రస్తావ మొకింత యావశ్యకము గావున నే నింతకుమున్న సంస్కృతకవిజీవితమందును, ఇపుడు సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయభాగమందును గావించిన దానిప్రస్తావ మించుక యిందు సంగ్రహించెదను.

సంస్కృతసారస్వతమునఁ బ్రసిద్ధిగాంచినయుత్తమ కావ్యములలో నొకటియై, అందలి కొలఁది గద్యకావ్యములలో నగ్రగణ్యమైనది కాదంబరి. భాషయందును శైలియందును, దీనికంటెఁ బూర్వమైన దశకుమారచరిత్రము దీనికన్న మిక్కిలిమృదువై పన్నెగాంచెననుట నిర్వివాదమే కాని, కథాకల్పనాచాతుర్యమున దాని కిది మిన్న. ఇందు, కథామధ్యమునఁ బ్రవేశించినకాదంబరీనాయికాపాత్రముకంటె నామూలాగ్రముగా నున్న చంద్రాపీడనాయకపాత్రమే ముఖ్య మగుటచే నిది చంద్రాపీడచరిత మనఁదగియున్నను, గుణాఢ్యుని బృహత్కథలోని కాదంబరీకథ యాధారముగా నుదయించుటం జేసి యీకృతి యానాయికపేరనే వెలసెనని తెలియనయ్యెడి. ఇది పైశాచీభాషలోని కాదంబరీకథ బీజముగా నంకురించినను, పశ్చాత్కథకవీంద్రుని వాక్సుధాధారలఁ దడియుటం జేసి శాఖోపశాఖలుగాఁ బెరిఁగి ప్రౌఢగద్యకల్పలతయై

తనవిజ్ఞానఫలరస మాస్వాదించినవిద్వాంసులవల్ల "కాదంబరీ రసజ్ఞానా మాహారోఽపి నరోచతే" అను పొగడ్త గాంచినది.

దీనికర్త యగుభట్టబాణుడు క్రీ. ౬౦౬-౬౪౮ నడుమ కాన్యకుబ్జము రాజధానిగా నుత్తరహిందూదేశము పరిపాలించినయతడును, హర్షవర్ధనుడనియు ద్వితీయశిలాదిత్యుడనియు వ్యవహరింపబడినవాడు నగు శ్రీహర్షచక్రవర్తి యాస్థానములోనివిద్వత్కవి. శోణానదిదక్షిణతీరమందలిప్రీతికూట మనుగ్రామము జన్మభూమిగా రాజదేవీచిత్రభానుల కుదయించి వేదశాస్త్రపారంగతుడైనయీకవి, చండీశతకము, పార్వతీపరిణయనాటకము, హర్షచరితము నను గ్రంథములు క్రమముగా రచియించి, కడపట నీకాదంబరి నిర్మించెను. కవిత్వవైదుష్యములందు సంపూర్ణానుభవ మార్జించిన పిదప సంతరింపబడినదీనినిబట్టియే యితనియశఃకాయము భరతఖండ మంతట విద్వల్లోకగోచర మగుచున్న దనుట వాస్తవము.

బాణునిగద్యశైలి యపూర్వ మతిగంభీర మపజ్ఞామూలకము. విశేష్యములవిశేషణములు వానివిశేషణములు వానివిశేషణములును గొలుసుకట్టుగా నతిదీర్ఘములైనసమాసములకలయికచే డీగసాగిన గుండ్రనియాకృతిలోనివాక్యములనేకము లొకటిరెండుమూడు పుటలవఱకును వ్యాపించుటయు- శ్లిష్టార్థకస్పష్టార్థకవ్యంగ్యార్థగభీరార్థాదిభేదములతో రసగర్భనిర్భరమై శబ్దజాలము చి[illegible]యుటయు, ప్రధాన కథావిషయము మఱ[illegible]ఖ్యమధ్య వర్ణన లతి

శా. పూర్ణప్రజ్ఞుఁడు మున్ను బాణుఁడు జగత్పూజ్యప్రభావుండు
వి। ద్యార్ణోరాశి రచించెఁ గావ్యమును గద్యస్ఫూర్తి నీనాఁ
డు మా। పూర్ణప్రజ్ఞుఁడు పద్యకావ్యముగ నింపుల్ మీఱఁ
గా మార్చి వి। ద్యార్ణోరాశికిఁ గృష్ణతీర్థునకుఁ దా నర్పించె
భక్త్యున్నతిన్.

ఉ. మామకుఁ గన్య నిచ్చితివి మామకు మామవు నైతి వెంత
యున్ । నీమహనీయచేష్టితము నేఁ గడు మెచ్చితిఁగాని వృ
ద్ధుఁడై । నేమములందు బ్రింగుకవి నేతకుఁ గన్య నొసంగి
నాఁడ వీ । ధీమహితాత్ముఁ డెక్కుడగు తేజము నాయువు
నందుఁ గావుతన్.

క. కాదంబరీప్రియత సం
పాదించిరి పెద్ద లొక్క బలరామునకే
కాదంబరీప్రియత సం
పాదించెను గృష్ణునకును మన పూర్ణుఁ డహో !

క. జామాతకు మధుపర్కము
మాను యొసఁగునపుడు మున్ను మాంసము ముఖ్యం
బై మలసె నిపుడు తత్సఖి
నీ మన పూర్ణకవి యొసఁగె నేనియుఁ దొసఁగే.

గీ. ఇట్టి యుల్లేఖములకేమి కృతికృతీశ
కృతిరచయితల కాయురభీష్టభాగ్య
భోగ్యములు గల్గఁజేయు నాభోగిశయనుఁ
గడఁగి ప్రార్థించి దీని నింక విరమింతు.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని,
కృతిసభాధ్యక్షులు.

క. పూర్ణప్రజ్ఞాచార్యా!
కర్ణానందనము నీదుకవనము సుకవీ!
పూర్ణాయురపత్యశ్రీ
వర్ణితధనకనక రేఖ వర్ధిలు తండ్రీ!. ౧

క. అవధానివి, శాస్త్రివి, స
త్కవివి, నృపాలాగ్రగణ్యగణ్యతఁ గనవా
వివిధోపాయము లెఱిఁగితి
వవురా! 'జన్మ'మన జన్మ మగు నీయదియే. ౨

క. శుభ మస్తు నీదుకవితా
ప్రభకును శుభ మస్తు నీదుపాండితికి సదా
శుభ మస్తు నీవిధేయత
కిభవరదునికరుణ విద్వదీశాఽఽశుకవీ! 3

గుంటూరు,
భావ సం॥ర
విజయదశమి.

ఇట్లు భవచ్ఛ్రేయోఽభిలాషి,
శిష్టా హనుమచ్ఛాస్త్రి,
ప్రధానాంధ్రపండితుఁడు,
టవున్ హైస్కూలు, గుంటూరు.

:0:

# పండితాశీస్సులు.

---:o:---

శా. పూర్ణప్రజ్ఞుఁడ వాఁడు వీ వనుచుఁ గాఁబోలీని కు మీాయయ్యా
మున్ । "పూర్ణప్రజ్ఞ" యటంచు నామకరణంబుం జేసె,
మేల్త్రైతలోఁ । బూర్ణప్రజ్ఞుఁడ వైతి; మాహృదయ మా
మోదంబునుం జెందె నో । పూర్ణప్రజ్ఞుఁడ ! నీకుఁ జేకుఱుత
సంపూర్ణాయురారోగ్యముల్.

క. కాదంబ్రము కృతులు పేయము
కాదంబరి, దానిఁ గ్రోల్చు ఘనులు నిపుడు మే
ల్కాదంబ్రుఁడు వత్స! నా కా
కాదంబరి మెడకు నంటఁగట్టితి వౌరా!

సీ. శబరియెంగిలిపండ్లు చవిఁగొన్న శ్రీరామ
చంద్రుఁ డే మపకీర్తిసాంద్రుఁ డాయెఁ
గుబ్జాకృతిని గోరుకొన్న శ్రీ రుక్మిణీ
విభుఁ డేమి వ్రేలు వంపించుకొనియెఁ
గుమ్మరిపుట్టిపూ ల్గొన్న మాకొండవెం
కన్న కేమి కళంక మంటుకొనియె
వ్యాధుఁ డిచ్చినమాంస మందియానందించు
సింగప్పకీర్తి కే చేటు గలిగెఁ

గీ. గాన భక్త్యర్పితం బెల్ల గ్రాహ్యతమమె
యనుచు శిష్యవత్సభక్త్యర్పితాంధ్ర
లలితగీర్వాణవాణీవిలాసవతిని
కృతిని గైకొన్న నే నతికృతిని గానె.

సీ. కాదంబరీరసాస్వాదంబు లేకున్నఁ
    గవి యగునె వాఁడు కాకవియె గాని
కాదంబరీరసామోదహీనుఁడు పండి
    తుం డౌనె యొకబండితుండె గాని
కాదంబరిని గ్రోలక సుకోక్తి బలరాముఁ
    డౌనె సాహ్రాముఁ డేను గాని
కాదంబరీసేవ గల్గక యక్షరా
    స్యుం డౌనె జననిరస్యుండె గాని

గీ. కానఁ గాదంబరీకృతిఁ గాంచు టెంతొ
కవికిఁ గృతిభర్తకును గీర్తికర మటంచుఁ
దలఁచి శిష్యార్పితాంధ్రకాదంబరీను
కృతికిఁ బతి నౌట కంగీకరించినాఁడ.

అవధానిశిరోమణి శాస్త్రి కృష్ణాచార్యులు,

కృతిపతులు.

విస్తరము లగుటయు, హేతువులుగా వక్రోక్తిమార్గము పట్టిన యితనిరచన మాకాలమందే స్తుతిపాత్రమైనదని —

"సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః,
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా"

అను రాఘవపాండవీయశ్లోకమునఁ దెలియుచున్నది.

పై లక్షణములకుఁ దోడుగాఁ గథకూడ నమానుషములు నద్భుతములు నగుచర్యలం జూపుచు నైజముగా నుండకుండుటంబట్టి, ‘ఇది కవిపాండిత్యప్రకర్ష తెలుపుటకుమాత్రమే యుపయోగపడు’ ననుచు నాక్షేపించిన వేబరు మొదలగు పాశ్చాత్యపండితులుగూడ, పురప్రాసాదము న్యాశ్రమ హిమాలయాచ్ఛోదసరోవరములు మహాశ్వేతావృత్తాంతము మనుష్యావస్థలు శుకనాసునియుపదేశము మొదలగువిషయముల వర్ణన లతిహృదయంగమములు, సహజాతిసహజములు నగుట చూచి బాణునియసాధారణప్రతిభావిశేషమున కచ్చెరువడి తల లూఁచి బళీయని ప్రశంసింపక పోలేదు. అద్భుతవర్ణన లాకాలమున సంస్కృతమందే కాదు, ఎల్లదేశభాషలందును, గలవనుట పాఠకలోక మెఱుఁగనిది కాదు. అవియే గ్రంథమునకుఁ, గలంకాపాదకము లగునేని, మొన్న మొన్న మనభాషలో వెలసినకళాపూర్ణోదయము ప్రాజ్ఞలోకము నాకర్షింపఁగలుగునా? కావునఁ దద్వర్ణనము లుండుట గ్రంథసారస్యమునకు భంగకరమని భ్రాంతిపడరాదు. ప్రతిభాశాలి యగుకవీంద్రుఁడు గావించునట్టి కథాసన్నివేశపాత్రరసపోషణాదులచాతురియం దట్టియద్భుతత్వ మమానుషత్వము నెక్కడనో యంతరించుటయు, పాఠకునిహృదయము కథారసమయ మగు

టయు, ననునవి యుత్తమకావ్యలక్షణములు. అట్టి యుత్తమ లక్షణసంపద తనకవిత్వమునఁ గలదనునాత్మవిశ్వాసము దృఢముగా నుండుటచేతనే యితఁడు—

"అస్తి కవిసార్వభౌమో వాత్స్యాయనసంభవో బాణః"

అనుచుఁ దన్ను వర్ణించుకొన్నాఁ డనవచ్చును. ఇట్టి బాణమహాకవి ముందు సత్యవిషయ మైనహర్షచరిత మాఖ్యాయికగా రచియించి తరువాత సత్యాసత్యవిషయ మైనకాదంబరీచరితము కథగా నిర్మించి ద్వివిధ మైనగద్యనిర్మాణకళానైపుణిని లోకమునకు వెల్లడించియున్నాఁడు. అట్టిలోకోత్తర మైనపూర్వకాదంబరికిని, భట్టబాణాత్మజుఁ డగుభూషణభట్టు తండ్రికిఁ దగినకొడుకై యీషద్వైషమ్యముగా నల్లిరచియించినయుత్తరకాదంబరికిని, మృదు వైనయనువాద మీయాంధ్రకాదంబరి.

ఏఁబదియేండ్లలోపలిగ్రంథకర్తలు కొందఱు సంస్కృతగ్రంథములు తెలిఁగించునపుడు తొంటిమహాకవులగునన్నయ తిక్కనాదులయాంధ్రీకరణమర్యాద నతిక్రమించి, మక్కికి మక్కి యన్నట్లు తూచా తప్పకుండఁ బ్రతిపదాంధ్రీకరణము నకుఁ గడంగి, అయ్యవారిని జేయఁబోయి కోఁతిని జేయుచు నట్లుచేయనివారిని దూఱుచుఁ దుద కది యన్నఁ దలనొప్పి యనియు రసహీనమైనను దానికంటె స్వతంత్రరచనమే మేలనియుఁ బాఠకలోకముచే ననిపించి విడిచిపెట్టిరనుట యందఱికిని విదితము. ఇది పూర్వకవులయాచారమును విడుచుటచేఁ దెలుఁగుసేఁతకు వచ్చినయపవాదము. నిజముగా నది క్లిష్టాతిక్లిష్ట మైనకృత్య మగుటయు నిందుకుఁ గొంతకారణమే కాని,

భావము ప్రధానముగఁ గొన్నచోఁ దెలిఁగింపు రుచించుటయుఁ గ్రంథము సార్థకముగుటయు సిద్ధించును. మాటకు మాట సరి పుచ్చుటయే ముఖ్యమని భావించినచో భావ మభావమగు టయుఁ గ్రంథము వ్యర్థముగుటయు సంభవించును. ఇందు మొదటి లక్షణమునకు లక్ష్యములైనవి ప్రాచీనార్వాచీనగ్రంథములు పెక్కు. రెండవదానికి గుఱియైనవి నవీనములు కొన్ని. వీనిని బట్టి యాంధ్రీకృతము లైనకృతులన్నియు నీరసము లనఁదగు నా? అనఁ గలమా? ఆంధ్రీకరణము లేక యాంధ్రమే లేదని మన మెఱుఁగమా? తెలుఁగుకవిత కదియే శ్రీకారము. కవి త్రయమువారి యట్టిభారతమే నాఁటినుండి నేఁటిదనుక మన కమృతభిక్ష. శ్రీనాథాదులయట్టికృతులే మనకు భక్ష్యములు. ఇంతయేల? స్వకపోలకల్పనమున కుత్తమోదాహరణ మైన కళాపూర్ణోదయమును విడిచినచో, ఆంధ్రీకరణవిపులీకరణాను రూపమున నున్న తెలుఁగుసారస్వతమునందుఁ బరసశ్రవణావ్యవ హారమునఁ బ్రజ్ఞలోకహృదయము నాకర్షించినగ్రంథము లనే కము లాంధ్రీకృతములే యనుట సత్యము. కావున నేది మన భాషకుఁ బుష్టిని దుష్టిని గలిగించినదో, దానిమర్యాద నెఱుఁ గనియాధునికకృతులు కొన్నిటినిబట్టి యన్నియు నట్టివేయని భ్రాంతిపడరాదు. ఈ యభిప్రాయమున కనుగుణముగా నాచార్యులుగారియనువాదమును విషయైకదృష్టియు భావ ప్రధానమునై పూర్వులు త్రొక్కిన త్రోవనే నడచినదిగాని, మక్కికి మక్కిమార్గము పట్టలేదని గ్రంథకర్త యవతారికలో వ్రాసినమాట గ్రంథపరిశీలనమువల్ల ధ్రువపడుచున్నది.

వచనరచన మెక్కువ యావశ్యకమనెడి యీకాలమునఁ గొందఱు పద్యమును గద్యముఁగా మార్చుచుండ గద్యమును బద్యముఁగా మార్చినయీకృతికర్త కుపదేశకుఁడు దశకుమారచరితాంధ్రీకర్త యగు కేతనార్యుఁడని ' కేతన సత్కవివర్యుండే తెనుఁ గొనరించెనేని యీకృతి ' యనెడి యవతారికపద్యమే చెప్పుచున్నది. కాదంబరి నొకరిద్దఱు తెలుఁగువచనముగా రచియించియున్నారు. బ్రహ్మశ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారు సుమారు పన్నెండు సంవత్సరములక్రిందటఁ బద్యకావ్యముగాఁ దెలిఁగించియున్నారు. ఈ రెంటిని బోల్చి విమర్శించుట ప్రస్తుతకర్తవ్యము కాదు. ఆచార్యులుగారు మూలమందు ప్రధానకథ కడ్డములైన యనేకవర్ణనలను సంగ్రహించియుఁ దెనుఁగునకుఁ దేనలవికానిపెక్కుశ్లేషలు విడిచియు, ' కాదంబరి కష్ట ' మన్నమాట తెలుఁగున రాకుండఁ జేసి కథాసన్నివేశమందలిచమత్కృతిని విడువక పోషించుచు వచ్చిరనుటయే యిందలివిశేషము. కృతికర్త యింతకుమున్ను శ్రీరామకల్యాణాదిపద్యకావ్యములు నాలుగైదు రచియించియుండుటచే నారితేఱిన కవిత్వమును విననింపై యొప్పుచున్నది. అట్టి యీకావ్య మాంధ్రభాషాభిమానుల యాదరము గాంచి చిరస్థాయి యగుఁగాక.

విశాఖపట్టణము,
12–10–1934.

ఇట్లు,
మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

—(౦)—

ఓమ్
శ్రీహయగ్రీవాయ నమః.

# ఆంధ్రకాదంబరి

## (ఉత్తరార్ధము)

## షష్ఠాశ్వాసము



శ్రీమద్వాజిముఖున్ మదిన్ దలఁచి వా
క్సీమంతినిన్ గొల్చి వి
ద్యామాన్యాత్ముల దేశికోత్తముల లో
ధ్యానించి గుర్వగ్రణీ
నామాంకంబుగఁ బల్లెవంశ్యుఁడను బూ
ర్ణప్రజ్ఞవిఖ్యాతుఁడన్
ధీమద్గణ్యము నుత్తరార్ధ మనుబం
ధింతున్ స్వకాదంబరిన్. 1

చ. సిరికి నురం బొసంగినవిశిష్టుఁడు శిష్టజనావనవ్రతుం
డరిమదకుంభికేసరివిహారుఁడు శార్ఙ్గగదాసిచక్రముల్
కరమున నొప్పుమేటి త్రిజగత్పతి మానరసింహమూర్తి వే
గిరమ సహాయుఁ డౌచుఁ దొలఁగించుత మత్కృతి కంత
రాయముల్. 2

వ. అని యిట్లిష్టదేవతావందనాదికంబు గావించి మదాంధ్ర కాదంబర్యుత్తరార్ధనిబంధనోద్యోగ మొక్కింతవాక్రుత్తు. 3

గీ. ప్రాభవోపేతముగఁ బ్రజోత్పత్తిచైత్ర
శుద్ధదశమిని వేంకటసుకవివిభుత
జరిపెఁ గృతిసభ మత్పౌరశాల సుగుణ
రాశి జూలూరు వేంకటరత్నబుధుఁడు. 4

శా. మావిద్యానిలయంబునన్ బుధుఁడు ధీమన్మానసీయుండు శిష్టావంశ్యుండు హనూమదాఖ్యుఁడు కవీశానుండుమత్తావ్యస ద్భావుం డెంతయుఁ బేర్మితోఁ గృతిసభన్ బ్రారంభమున్ జేయ వి। ద్యావంతుల్ బొగడం బఠించితిని మత్కాదంబరీ గ్రంథమున్. 5

మ. కృతి కాదంబరి తెల్గుఁ గింకవిఘటీకాకేసర్యభిఖ్యాకుఁడు న్నతుఁడౌ వేంకటశాస్త్రిసత్కవి సభాధ్యక్షుండు మేధావి వి। శ్రుతుఁడౌ కృష్ణబుధావతంసము కృతీశుం డెంతయున్ బ్రాజ్ఞులున్। జతురుల్ సభ్యులు తత్సభం బొగడఁగా శక్యంబె మాబోంట్లకున్. 6

వ. అట్టిపండితసభయందు మదాంధ్రకాదంబరీపూర్వభాగంబుఁ బఠించి మద్గురువరేణ్యు లగు కాశీకృష్ణకవివర్యుల కతిభక్తితో నంకితముసేయుతఱి సభ్యులలో నొక్కరుండై. 7

సీ. 'సిందుమనంబు'లో నెగడుద్విజాతిల
క్షణమునకున్ నిదర్శన మొనంగు
ఎవ్వాని వినుతింతు రెల్లవారును బట్టు
దల భగీరథులఁ దన్ను ననుచు

ఎవనితో భాషించు నెడఁ గుమార్గులును స
న్మార్గు లౌదురు కొన్ని నాళ్లలోన
ఎవరికైన యేతెంచు రేఁటేఁట వార్షిక
ధనము చేకొనఁగ నధ్యయనపరులు
గీ. ఆతఁ డాత్రేయగోత్రుఁ డేకాన్వయుండు
వాసిఁ గన్న సుబ్రహ్మణ్యవరసుతుండు
రుక్మిణీగర్భభవుఁ డుదారుండు శ్రీమ
దన్నపూర్ణాధవుండు దండయబుధుండు. 8

మ. 'అతిరిక్తుం' డను నస్మదీయ మగు పద్యంబాదునన్ శ్లేషగ
ర్భితవాభావముఁ దత్సభన్ వినుట ముద్రింపంగ లోనెంచి
ము। త్వత్కృతి మాయింటికి వచ్చి తెల్ప నది యెంతేఁ గాంచి
మోదం బయ్యె। చితలబ్ధం బగు తత్సహాయతకు వాసిం బ
ల్కితిన్ నే నిటుల్. 9

ఉ. ఎంతటివాఁడ నేను తమ రే యిటు మద్గృహ మేగుదెంచి
మీ। యాంతట మీరె మత్కృతికి నయ్యెడువిత్త మొసంగి
యిచ్చువే। యింతునటంచుఁ బల్కితి రిదేకద దాతకుఁ
జిహ్వ నుర్థి తా। నింతయుఁ గోరకే యతని యిష్టముఁ
గూర్చుట దండయాగ్రిణీ! 10

మ. సిరి చెన్నారెడు వారు లేరె ధరణిన్ జేసాఁచి యర్థించినన్
సరి పొం డీతరుణంబు కాదనుచుఁ బశ్చాచ్ఛబ్దు లౌచుం
దు రి। కృరణిం గోరకమున్న యర్థ మిడఁగాఁ గాంక్షింత్రె
మీదాతృతా। గరిమం బెన్నఁగ నాకు శక్యమొకో యేకా
వంశరాకాశశీ! 11

మ. ధనమందుఁ గతతృష్ణు లెవ్వ రిల నేతన్మాత్రమే చాలు
నా । కని యార్జించెడిశక్తి యున్న విడి తౌరా ! న్యాయ
వాదిత్వవృ । త్తిని, దద్ద్రవ్యము ధర్మకార్యములయందే
యుంచితో నీపవి । త్రన మెన్నంగఁ దరంబె యెల్లరకు
నాదర్శంబవై తెంతయుఁ. 12

సీ. తావకగర్తపత్తనసత్రిరాజమే
తమధర్మబుద్ధి కుదాహరణము
జీర్ణదేవాలయశిథిలత మాన్పుటే
తమదైవభక్తినిదర్శనంబు
విద్యార్థులకు మాసవేతనా లిడుటె మీ
విద్యాభిమానప్రవృత్తి కిరవు
ఏకాదశీవ్రతాస్తోకదీక్షయ భవ
త్పాత్రిక్తనాచారాదరంబుగుఱుతు

గీ. ప్రత్తిపాటను ధర్మసత్రంబు వైచి
యొక్కవిద్వత్కుటుంబ మం దుంచి ప్రత్య
హము పురాణంబుఁ జెప్పించు టదియ మీదు
పండితాదరతఁ దెల్పు దండయార్య ! 13

ఆ. మీకలార్థు లెల్ల మెటికలు మీపరి
శీలనంబొ మీదుసిరివిధంబొ
అగును మీరు తలఁచునవి యెల్ల సంకల్ప
బలమొ పట్టుదలయొ తెలియ మనఘ ! 14

మ. తొలుతఁ మీరలె గర్తపత్తనమునందుఁ వేదవిద్యాపరీ
క్షల నుత్తీర్ణుల సత్కరించితిరి సత్సంకల్పతఁ వారి కా

వల మేలమ్యోను వేదపోషకసభల్ వర్ధిల్లి యుండం ; దనా
విలమా మీాధన ము త్తరో త్తరమహావృద్ధిఁ బ్రసాదింపదే?

ఉ. కంటిఁ బదేపదే తమరు కార్యముపట్టుల బీదసాదులన్
గుంటుల గుడ్డులన్ బిలిచి కుత్తుకబంటిగఁ బిండివంటలన్
తింటకుఁబెట్టి వల్వ లుపదించుట కొంద అదేమొ మెక్సాఁగ్రె
కొంటకు గొప్పవారలకె గూర్చెద రిట్టిరు నెట్టివేయుచున్.

సీ. చెప్పినయట్టుల చేయఁజాలుదు వీవు
చెప్పుదు రన్యులు చేయలేరు
నావిధి యంచు దానం బొనర్చెద వీవు
పెరవార లిత్తురు పేరుకొఱకు
వినుతి యేమాత్రంబు విననొల్ల వీ వారుల్
కొనియాడు మందురు ధన మొసంగి
కఱప నీతిని మోముకడన యందువు నీవు
వరు లనెదరు చాటుపాటుఁజూచి

గీ. దైవ మతిధన మిడుట పేదల భరింప
నని తలంచెద వీ వన్యు లాత్మకొఱకె
యంచుఁ దలపోసికొందు నీ కన్యులకును
దారతమ్యం బదింతెపో దండయార్య ! 17

ఉ. శ్రీమహితుండు లౌకికుఁడు శేముషిఁగాంచినన్యాయవాది
యం । చే మిముఁగూర్చి వింటి మును పిప్పుడొ గంటి భవ
ద్గుణంబులన్ । నేమము లీవులున్ మది గనన్ ముద మో
కరుణాంబురాశి ! యో । కోమలకీర్తి ! మీసుగుణకోటికి
దాసుఁడ నేఁటినుండియున్. 18

వ. అనియిట్లు తత్కాలానుగుణాలాపంబులఁ గొంతతడ విష్ట
గోష్ఠినుండి తదాజ్ఞాప్రకారంబ కించిదూనంబుగా నున్న మ
దాంధ్రకాదంబరీపూర్వభాగంబుఁ బూరించుకొని యచ్చున
కిచ్చి ముద్రితంబయినయంత యయ్యుదారుకడకుం జనిన
నా సంపన్నుండు న న్నాదరంబునఁ గనుంగొని. 19

మ. కరముం గా మెచ్చిరి పూర్వభాగమును మీ కాదంబరిన్
న్వ్రాయుఁ డు । త్తరభాగంబునుగూడ వ్రాయుమని మెండన్ దా
వౌను శంకాళికిన్ । గురునిన్ బూర్ణకృతిసు సల్పఁ డీక
నాకుంగూర్పఁ జేతత్కృతిన్ । బరిపూర్ణం బగుదాని ధాత్రి
నెలయింపం గల్గుసద్భాగ్యమున్. 20

క. అనవుడుఁ దదుదారతకున్
మన మచ్చెరువొంద నంటి మహనీయగుణా !
వినుము భవత్సంకల్పం
బనుపమ మద్దాని కేను యత్నమొనర్తున్. 21

మ. తిరమౌకూరిమి మత్కృతిం దమరు ముద్రింపించుటన్
దానిలోఁ । గొఱవన్ దీర్చి పూర్వభాగమయినన్ గూర్పంగ
నా కామెను । త్తరభాగంబునుగూడ వ్రాయుటకుఁ బ్రో
త్సాహంబు గావించుటన్ । మఱవన్ జాల భవన్మహోపకృతి
సన్మాన్యా ! వదాన్యాగ్రణీ ! 22

వ అని యాసుజనావతంసముకడ సెలవుగొని యింటికిం జని
కార్యాంతరవ్యాపృతుండనై గ్రంథనిర్మాణంబునకుఁ గడంగ
కుండిన నమ్మహామహుండు ప్రోత్సాహంబును. 23

క. అనఘా! సంపూర్ణం బా
యెనె? యుత్తరభాగ మనుచు నే లేదన, నేఁ
గనఁబడినపుడెల్ల నన్
నను నిట్లు ఋణస్థుఁ జేయ న్యాయమె యనుచున్. 24

వ. అదియునుంగాక. 25

మ. తమ కాదంబరిఁ బూర్వభాగమును సందర్శించినా ముత్తరా
ర్థము గూడన్ ద్వరలో రచించి ముద మొందం జేయుఁ డం
చున్ బుధో। త్తములున్ సత్కవులున్ సుహృజ్జనులు నే
తద్దండయాత్రోక్తి కూఁ।తముగాఁ బల్కుట నుత్తరార్థ మెద
సంధానింప నుంకించితిన్. 26

వ. కాని 27

మ. బడిపాఠంబులు సెప్పిసెప్పి యొకటన్ బ్రొల్మాలి కొ
న్నాళ్ళు నా। కడ నింటం బఠియించుశిష్యతతికై కష్టించి
కొన్నాళ్ళు వల్। కడగండ్లం బడి కొన్నినాళ్లు వృథగాఁ
గాలంబు పోఁజొచ్చె ని। ల్కడ చేకూర దిఁకెట్లు వ్రాయు
దునో నేఁ గాదంబరీశేషమున్? 28

ఉ. అంబరకేశదివ్యచరణాంబుజభక్తుఁడు బాణభట్టు కా
దంబరిఁ బూర్వభాగమకదా రచియింపఁగఁ జాలె నుత్తరా
ర్థంబు తదీయపుత్త్రరచితం బగుటన్ మఱి యేకకర్తృక
త్వంబిట లేదయేమొ యిఁక దైవసమీహిత మెట్టులున్నదో.

క. అర్థం బీకృతి యంచున్
వ్యర్థంబుగ నోట వచ్చె నటు లేటికొ నా

కర్థము గాకున్నది గు
ర్వర్థాదృతకార్య మెట్టు లసమగ్రమగుఁ ? 30

క. దీనత్వ మింత యేటికిఁ
గానున్నది కాకపోదు కానిమ్ము తుదం
గాననుకృప యించుక నా
పైనుండిన నిద్ది నాకు భారమె యనుచుఁ. 31

వ. ఒక్కనాఁడు నిర్మలహృదయంబుతో మదభీష్టదైవం బారా
ధించి యుత్తరార్థగ్రథనకౌతూహలినై భట్టబాణభూషణ
భట్టులకవితాఘట్టంబుల యందచందంబుల కానందించుచుఁ
దదీయపితృపుత్రభావం బసదృశంబుగా నెంచితి. 32

సీ. ఒకఁడు కల్పించె లోకోత్తరమహాగాథఁ
జివరంటగాఁ బూర్తిచేసె నొకఁడు
ఒకఁ డల్లికలయందు నొయ్యారముం జూపె
నడలలో నడరించె బెడఁగు లొకఁడు
ఒకఁడు వర్ణనములం దుద్దండుఁ డనిపించె
కథ విప్పుట నొకం డఖండుఁ డాయె
ఒకఁడు నానాశ్లేషలకు భారతిం జొన్పె
సరసోక్తిఁ దన్పె వాక్సతి నొకండు

గీ. బాణకవికిని భూషణభట్టకవికిఁ
గాక యీలాటి పితృపుత్రగౌరవంబు
వేయిజన్మాలు తపముగావింత్రుగాక
కలిగనే యన్యజనుల కెక్కాలమందు ? 33

ఉ. పాండితియున్ గవిత్వమునఁ బ్రజ్ఞయు రెండునుగూడ నొ
క్కచో । నుండిన నుండవచ్చు నొక రొక్కరియందున నుం
డు నేమహో । ద్దండున కన్యకల్పితకథాపరిపూరణశక్తి
పోమెఁబో । పండితపుత్త్రిఁ డన్నుడి కపప్రిథ భూషణ
భట్టు పుట్టుటన్. 34

ఉ. భూషణభట్టుభాషణము భూషణమై బుధకర్ణపాళికిన్
దోషముఁబట్టుద్రాక్షులమధుప్లుతిఁ దత్కదళీఫలావళీ
భేషజమున్ సడల్చు సులభీభవదుజ్జ్వలశైలితోఁ గథా
పోషణ ముల్లసిల్ల రసపోషణ మెంతయుఁ దోషణం బిడన్.

గీ. రసమయంబుల నీకవిరాజునుడుల
నా కలవిమైనయట్లు లాంధ్రీకరింతుఁ
బూర్వభాగంబునందునఁబోలె నిందు
నియమముల నాదరింతు మనీషులార ! 36

సీ. అభిమతదైవతం బగుహయాననకృపా
భ్యుక్షితోరుకటాక్షవీక్షణంబు
మామకీనాచార్యమాళి కాశీకృష్ణ
పండితపదయుగాఖండభక్తి
కృతిసమర్పణసభాపతి మహాకవియు నా
చెళపిళ్ళబుధునియాశీర్బలంబు
ఏకాకులాంభోధిరాకాశశాంకుప్రో
త్సాహపూర్వకమహోదారఫణితి

గీ. దోహదంబులు కుతుకసందోహదములు
గాఁగఁ గాదంబరీపూర్వఖండ మస్మ
దీయ ముత్తరఖండంబు దీనిఁ జిగురు
వేయ సాఁగె బుధాదరవృష్టి నేఁడు. 37

ఉ. ధీనిధిఁ గాశికృష్ణబుధు దేశికుఁగా వరియించి శ్రీగురు
భ్యో నమ యంచు వారికడ ముత్కలసంస్కృత మభ్యసిం
చితిఁ । గానఁ గృతజ్ఞతాలవము గా నిపుడీకృతి నిచ్చు
చుంటి నే । గాని సభాసదుల్ కవనగర్వముచే నని యెంచఁ
బోకుఁడీ. 38

సీ. ఎవనివాఙ్ముఖమున్నఁ జెవులొగ్గి వినుచుండ్రి
కొమ్ములు దిరిగినకోవిదులును
ఎవనియధ్యక్షత కెదురుచూచెడు భార
తమహీసనాతనధర్మసభలు
ఎవనియాశ్రమసీమ కేతెంతు రతిథులై
ఘనమాండలికకరగ్రామముఖులు
ఎవనియొజ్జతికంబు నెద నెంచె * శార్మణ్యా
దేశంబు బాలబోధినులఁ గొంచు

గీ. అట్టిపవిత్రభాగధురీణున కస్మదీయ
భాగధేయంబునకు మహాపండితునకుఁ
గృష్ణకవిమౌళి కొజ్జ కంకిత మొకర్చు
నాంధ్రకాదంబరీశేష మైన దీని. 39

---

* శార్మణ్యదేశము = జర్మనీ.

## —* కథావతరణము *—

—:o:—

శ్రీమత్కౌశికకులాంబుధి
సోమా ! శ్రీకృష్ణనామ ! సుజనలలామా !
ధీమద్గణనీయగుణ
స్తోమా ! కవితాభిరామ ! సూక్త్యుద్దామా ! 40

వ. ఆచార్యవర్యా ! అవధరింపుము. జాబాలి మునీంద్రుఁడు హారీతాదులతోఁ జెప్పినట్లు వైశంపాయనశుకంబు శూద్రకునితో నావలికథ యిట్లు చెప్పందొడంగె. అట్లు గంధర్వరాజపుత్త్రి పత్త్రలేఖచే నాశ్వాసితయై వెండియు నిట్లనియె.

చ. తెలియుదు నీకు నాయెడ నతిప్రియమంచు శిరీషపుష్పపే
శలరుచిరస్వభావ లలసారసగంధులె యుందు బాలతా
లలితకుమారికాజనములా ! యిఁకఁ జెప్పెడిదేమి వారి క
ట్లలవడు సాహసాదృతములౌ నిటువంటి ప్రగల్భభావముల్.

గీ. కలరు సాహసకారిణు లిలను గొంద
అంపుదురు వారు సందేశ మాత్మవల్ల
భుజకు లేదేని యచటికే పోవుచుందు
నేనొ బాలను సిగ్గు నేమి చెప్ప ? 43

శా. పౌనఃపున్య మతిప్రియుండ వనుచుం బల్కన్ రాజకన్యామా
నే నిక్కం బ్రియునంట వేశ్యనుడియన్ నీయందె రాగం
బనన్ ! ప్రాణంబుల్ చను నీవు లేమి నన నన్ బ్రత్యక్ష మేఁ
చున్ ననున్ ! సూనాస్త్రుం డన నాత్మదోషవిసరాస్తో
కోపలంభం బగున్. 44

సీ. వచ్చువిల్కాఁడు నీ కిచ్చె నన్నన్న నా
పలు కుపసర్పణోపాయ మగును
ఎట్టకేలకు నిన్నుఁ బట్టెద ననుటయుఁ
దగ దది బంధకీధార్ష్ట్య మగుటఁ
దప్పక యిచటికిఁ దరలి రావలె నంట
సౌభాగ్యగర్వంపుజాడఁ దెలుపు
ఏనె నీసన్నిధి కేతెంతు నన్నయా
లాఘంబు స్త్రీచాపలతను జాటు
గీ. ఎఱుఁగుము యనన్యరక్త యీయింతి యనుట
స్వీయభక్తినివేదనోపేయలాఘ
వం బగును నేటి కిఁక మరణంబుచేతఁ
బ్రణయ మరసెద వన నసంభావ్య మదియు. 45

వ. మఱియు నిట్లనుఁ. 46

సీ. కొనివచ్చినను గుమారు నిటు తారళ్యల
జితలజ్జ యదియె దర్శింపనీదు
దర్పకతీవ్రబాధావిలక్షంబు వై
లక్ష్యమే యెదుట నిల్వంగనీదు
పరికింప నప్రతిశక్తిసాధ్వసజడ
జడిమయే ముందుకు నడవనీదు
స్వీయ ముపసర్పణోదయలఘులఘుతయే
తత్ప్రతిపత్తి కూఁతంబు కాదు
గీ. అక్కట ! బలాత్తదానయనాపరాధ
భీతభీతియె ముందు కన్పింపనీదు

అంబుజాతాక్షి ! నీవు నెయ్యమున రాజ
సూనుఁ గొనివచ్చుటయు వ్యర్థమానో యేమొ ? 47

మ. గురు లేమందురో యన్నసిగ్గుననో ? పెక్కుల్ రాచకర్జం
పుఁదొం। దర లం దుంటనో ? జన్మభూమిపయి వాత్స
ల్యంబునం జేసియో ? । చిరదృష్టాప్తుల వీడలేమినో ?
యిటం జిత్తంబు లేకుంటనో ? । చరణంబుల్ గొని వేఁడ
నీ వతఁడు రాఁజాలండ యే నేమనన్. 48

వ. అదియునుంగాక నా కిప్పు డేమియధికంబు చేకూరె. 49

మ. ఎలఁదేఁటుల్ కలరావముల్ సలుప నెంతేఁ గోకశోకధ్వ
నుల్ । చెలరేఁగఁ మునిమాపునౝ విరహులన్ జెండా
డఁ బూవిల్తుఁడుౝ । మలయుౝ దెమ్మెర లొప్ప జ్యోత్స్న
హిమసద్మంబందు ముక్తాశిలౝ । గలపూసెజ్జఁ గుమారదృ
ష్ట నగునక్కాదంబరిౝ నేనగా. 50

సీ. ఆతనిఁ గాంచినయపుడె పునర్దర్శ
నముఁ గోరె నీనయనములె కావె
లోనఁ జొచ్చినవానిఁ బూనఁజాలక చేల
యగుపాడుహృదయ మియ్యదియె కాదె
చిరకాల మాతనిచెంగట మ్రోడునాఁ
గదలకుండినదేహ మిదియె కాదె
అమృతంపుగురువుల కడలి తన్గానకుండఁ
జేసికొన్నదియు నీచేయిగాదె

ఆ. అవిదితాన్యపీడుఁ డైనచంద్రాపీడుఁ
డతఁడె యెగుదెంచి యరిగె రెండు

మూర్ఖ నీవు చెప్ప మదనుఁ డాతఁడె క్షీణ
శరుఁడు నాయెడల నశక్తుఁ డవల. 51

ఉ. ఆతఱి నే నొనర్చితిఁగదా యిటుబిట్టుఱప్రతిజ్ఞ మామహా
శ్వేత సదుఃఖయై చెలఁగఁ జేసికొనన్ మఱిపెండ్లి యంచు న
న్నాతికిఁ జెప్పియుంటి నిది నన్నె నష్వుదు హంసపుత్రి దే
వీ ! తగునొక్కొ యీప్రతిన వీడుట నీమది నిట్టిభావమున్.

క. దారుణుఁ డెంతయు నీసుమ
నారాచుఁ డొకప్డు ప్రియజనము గనరామిన్
గూరిచి వల పధికముగా
నారాటంబెట్టి ప్రాణమైనన్ దీయున్. 53

గీ. అదియు నాకు ఘటింపదు మదనుఁడో, వి
యోగమో, దైవమో, ప్రియమో, మనంబొ
మదమొ, యేదియొ సంకల్పమయుఁ గుమారు
నాకు దయచేసె నతని నెన్నంగనశమె ? 54

క. జను లెంద ఱున్న నం దె
వ్వనికిఁ గనరాక యుండవచ్చుచు సిద్ధుం
డన నీనరపాలకనం
దనుఁ డెప్ప డొసంగు నాకు దర్శన మతివా ! 55

వ. మఱియు నారాకుమారుం బలె నీసంకల్పమయరాజకుమా
రుం డకాండపరిత్యాగనిష్ఠురహృదయుండును గాఁడు. ఈతండ
మద్విరహాకాతరుండై లక్ష్మీవ్యాకులుండును గాఁడు. పుడమి
కొడయుండును గాఁడు. సరస్వతిం గనండు. కీర్తిఁ బెంపు
సేయండు. ఈతండు రేయి యనక పవ లనక సర్వవేళల

యందును సర్వావస్థలయందును నాకన్నులకుఁ గనుపట్టు చుండు. ఇంక నీతనిఁ గొనివచ్చుముచ్చట లేల? యని నొడువుచుఁ దలవనితలంపుగా మూర్ఛిల్లినదియుంబోలెఁ గనులు మూసికొని కొంతసేపు తూష్ణీంభూతమై యట్లే యుండెఁ దద్వచనంబు లాకర్ణించి యప్పుడు నే నాత్మలో నిట్లు తలంచితిని. 56

గీ. మహిఁ దలంపఁగ సంకల్పమయుఁడు ప్రియుఁడు
అధికమౌ జీవితాలంబ మగు వియోగి
నుల కటఁ గూడఁ గలకామినులకు మెంతు
వారిలో మిక్కుటంబు కుమారికలకు. 57

సీ. దూతికాజనపాదపాతాదిదీనభా
షంబులు లేనికూటంబు లెన్నొ
చనుదోయి కొత్తిడిఁ గొనఁజేయుబల్వింత
వింతలౌ బిగికౌఁగిలింత లెన్నొ
కురులమొత్తము చిక్కగొననివిలాసని
శ్చలకచగ్రహామహోత్సవము లెన్నొ
గురుజనంబులు కనుగో లేనినొక్కులు
తనరారుదంతక్షతంబు లెన్నొ

గీ. సద్దుమూసినతియ్యనిముద్దు లెన్నొ
యితరు లెఱుఁగనివలపుఁజెయిదము లెన్నొ
మన్ననఁ గాంత్రు సంకల్పమయుని బ్రియుని
గూడి పైఁ బేరుకొన్నపూఁబోఁడు లెందు. 58

గీ. ఇతని నంధకారవితతి మాపఁగలేదు
కప్పివేయలేదుకద హిమాని
స్తబ్ధుఁజేయలేదు జలదధారాపాత
మంచు నాత్మలోన నెంచునంత. 59

మ. అనురాగైకకథారసోరుఝరిలో నాప్లావితుండయ్యెనా
దిన మారుణ్యముఁ దాలిచెన్ బ్రకటరక్తిన్ మీఱుకాదం
బరీ । వనజాక్షీహృదయంబుఁ జూచి త్రపఁ బర్వంజొచ్చె
నాఁ గానిపిం । చెను శోణంబయి సూర్యమండలము నిస్తే
జంబుతో నత్తఱిన్. 60

గీ. సాంధ్యరాగంబుఁ బల్లవశయనముగను
యామినీసతి కల్పించె నాప్రదోష
కాలమును బరిచారకులీలఁ గూర్చె
మణిశిలాతల్పముగఁ జంద్రమండలంబు. 61

వ. ఇంతలోఁ దమతమనియోగంబు లొనర్చువారై దూరంబు
నన గంధతైలావసిక్తంబు లగుదీపికలం గొని బాలిక లాయ
మం బరివారించిరి. అప్పుడు నిజలావణ్యాలక్షితంబు లగుదీపి
కాప్రతిబింబంబుల నంగలగ్నంబు లగుననంగనారాచశల్య
కంబులం బోలె వహించుగంధర్వరాజపుత్త్రితో మరల నిట్లు
విన్నవించితిని. దేవీ ! యనుగ్రహింపుము. ఖేదానర్హ వగు
నీవు హృదయఖేదకారి యగుసంతాపంబునకుఁ దగవు. కో
పవేగం బణంచుకొనుము. ఇదిగో యిప్పుడే చంద్రాపీడుఁ
గానివచ్చితి ననుకొనుమన నేలినవారినామగ్రహణంబు
గలమద్వచనంబుచే విషాపహరణమంత్రంబుచే విషమూర్ఛ

తయుంబలె వెంటనే కన్నులు తెఱచి నన్నుం గనుంగొని పత్రలేఖా! మొగముముందు చెప్పుట గాదు; నిన్నుఁ గాంచుచుండుటం జేసియే యింతదనుక జీవంబుఁ దాల్చియున్నాను. కానిమ్ము నీ కిట్టినమ్మకమేని నీ వేగి మనోరథంబు సాధింపుమని దేహధృతంబు లగునాభరణాదుల నాకొసంగి నన్నిట కంపెనని మనవి చేసి కొంచెము శిరంబు వంచి పత్రలేఖ మరల రాకుమారుతో నిట్లనె. 62

గీ. విన్నప మొనర్తు దేవ! దేవీప్రసాద
జనితవైదగ్ధ్యనై భిన్నమనముతోడ,
దీనవత్సల మగుభవదీయప్రకృతి
కట్టిదేవి నుపేక్షించు టర్హ మగునె. 63

వ. ఇట్లుపాలంభగర్భంబుగాఁ బత్రలేఖచే విజ్ఞప్తుండై చంద్రాపీడుండు స్నేహపురస్సరంబు లగుకాదంబరివచనంబులు తలపోసి తలపోసి ధీరప్రకృతియయ్యు మిక్కిలి పర్యాకులుండై పత్రలేఖతో నిట్లనియె. 64

సీ. పత్రలేఖరో! మోసపడితి నే మొనరింతు
గంధర్వపుత్రి న న్నాంచినపుడు
మదనగృహీతయై మానసం బెఱుఁగింప
శృంగారచేష్టలఁ జేసె నేను
దుశ్శిక్షితంబును దుర్విదగ్ధము ధీర
మానియుఁ బండితంమన్యమైన
నామూఢహృదయంబు నమ్మ దెన్నఁడుఁ దొల్లి
గనియుండమిఁ దేవకన్యకలను

గీ. ఆమె కియ్యవి నైజంబు లంచు నెంచె
దానఁ గాదంబరీదేవ్యనూనదుఃఖ
మునకు మఱి నీయుపాలంభమునకు నిక్కు
తోయజాక్షిరో! హేతుభూతుండ నైతి. 65

చ. తలఁచెద నన్నిటుల్ హృదయతాపకరం బగుశాప మెద్ది
యో। కలఁచుచునున్నదం చదియ కానియెడన్ మఱి యప్రి
బుద్ధబు । ద్ధులకును దేటతెల్లమయి తోఁచెడునమ్మదిరాత
నూభవా । లలితమనోజలక్షణములన్ గనియున్ మది
మోసపోవునే. 66

మ. సుదురూహంబులు నన్యథాగతములున్ సూక్ష్మాతిసూ
క్ష్మంబులున్ । గద యేతత్స్మృతముఖ్యభావము లెఱుం
గన్ శక్యమే యన్నచో । నది పోనిందు చిరానుభూతము
స్వకంఠాసక్త మాహార మిం । పొదవన్ నామెడ నుండఁ
జేసె నదియే నూహింపఁగాఁ జేయదే. 67

చ. హిమగృహవర్తనక్రియ మదెల్లను నీకును దెల్లమే కదా
కుముదహితాస్య నన్ బ్రణయకోపముచే ననరానిదేమ
నన్ । రమణిరో! నాదె సర్వ మపరాధము గావున వేయు
నేల ప్రా। ణము లిడియేని దేవి నిఁక నన్ గఠినుం డనకుం
డఁ జేసెదన్. 68

వ. అని రాసుతుండు పల్కుచుండఁగనే వేత్రపాణియై ప్రతీ
హారి ప్రవేశించి నమస్కరించి యువరాజా! యేలినవారికి
విలాసవతీమహాదేవి యిట్లు సెలవిచ్చుచున్నది. 'పత్రలేఖ
యేతెంచినదియని పరిజనంబువలన వింటిని. నేనే యా

మెను బెంచియుండుటం జేసి మీయుభయులందును నాకు
సమానస్నేహంబ. మఱియు నిన్నుఁ జూచియుఁ జాలకాల
మైనది పత్రలేఖతోఁ గూడ నిన్నుఁ జూడఁ గోరుచున్నా' నని.
నావుడుఁ జంద్రాపీడుండు తనలో-ఆహా! జీవితంబు సంశయ
డోలాధిరూఢంబు. 69

చ. ననుఁగనుగోకయుండిన క్షణంబును నిల్వద తల్లి తల్లడి
ల్లును ననిమిత్తవత్సలత లోఁగొని దేవియనుగ్రహంబు రాఁ
గొనె ననుఁ జిన్ననాఁటియనుఁ గుందలికూరిమి పేర్మిపెద్ద నె
మ్మనము మనోరథాకులత మ్రగ్గెడు నేమియొనర్చువాఁడనో.

క. తాతచరణశుశ్రూషా
ద్యాతతసౌఖ్యముల వీడ నగునే? యకటా!
చేతోభవహతకుఁడు దు
ర్నీతుఁడు శక్యంబొకో తరింపఁగ వానిన్. 71

సీ. గురుజనలాలనల్ గొనియాడఁదగినవి
యుత్కంఠ లింతయు నోర్వరావు
బాంధవస్నేహంబు బంధించు నభినవ
ప్రార్థన కౌతుకప్రదము మిగుల
ఎప్పుడు ననుఁ గాంచ నెంతు రెల్లరు నృపుల్
కాదంబరిని నేను గాంచ నెంతుఁ
బ్రజలకు నాపైనఁ బరఁగు రాగము నాకు
గంధర్వపుత్రిపై గాఢరక్తి
గీ. జన్మభూమి కటా! దుస్త్యజంబు, చేకొ
నఁదగు గంధర్వసుత, జాగు నాతిమనము

కాంచెమే నోర్వ దిశ హేమకూటవింధ్య
శైలరాజంబులకుఁ గ్రీలుఁ జాల దవ్వ. 72

వ. అని చింతించుచునే ప్రతీహారి దారిఁజూపఁ బత్త్రలేఖకరంబు
గొని జననీసమీపంబున కరిగి యందు మాతృలాలనసుఖం
బుల నాపవలు గడపి. 73

గీ. అంధకారితదశదిశ యాచు నంత
నాత్మచింతయుఁబోలె రే యరుగుదేర
శయితుఁడై రాసుతుఁడు శాంతిసదనమైన
మగువరూపెద నెంచు మమత్వ ముంచు. 74

క. నాఁడు మొదలొకని చంద్రా
పీడుం డెపు డరయు నాత్మఁ బ్రియసతిఁ బూవి
ల్కాఁడు ప్రహరించునట్టులు
తోడనె తనమేను నడుమఁ దూరఁ గొనఁ జేయుఁగా. 75

చ. మనసిజ! యేల యిట్లు దయమాలి కటావెడవింటితూపు
లఁగా! గొనకొని మాలతీకుసుమకోమలయా చిగురాకుఁ
బోఁడిపై! ననుచిత మాచరింతు వపురా? యిది శూరత
యే? యటంచుఁ దెల్పినవిధ మొప్పఁ గంటఁ దడిఁబెట్టుచు
నాతఁడు ప్రొద్దుపుచ్చెడుఁగా. 76

సీ. అతనుప్రహారమూర్ఛిత సతిఁ దేర్పనా
సాగించు స్వేదనిశ్వాసములను
మూర్ఛదేఱ నటన్న మోదమ్ము చే ననఁ
బూను నెల్లెడ మేనఁ బులకరింపు

మగువ బాధ నెఱుంగ మది నంపెనో యన
గానుపించు మనోవిహీనునట్లు
అంగనప్రతివార్త నాలింపఁగా సావ
ధానుండునాఁ దాల్చు మానముద్ర

గీ. అల్ల కాదంబరీవదనావలోక
నాంతరితమన నేదియు నరయఁ డతఁడు
పలుపలుకు లేల చంద్రబింబమునఁ గూడ
హాయిఁ గొనదాయె నేమందు నతనిదృష్టి. 77

గీ. చిత్రరథతనయాలాపపాత్ర మైన
యతనికర్ణంబునన్ దూఱదాయె నేదియు
అందఱకు మోద మొసఁగువీణారవంబు
నవల నే యుండెనన నన్య మడుగవలెనె? 78

చ. అరసెద రేమొ స్వీయహృదయంబను భీతి నొకప్పు డేనియున్
దరిసెనమీయఁ డేరికి సతంబును మంటలు గానరాక యే
స్మరశిఖి కాల్చుచున్న నవసారసకల్పితతల్ప మేనియున్
గురుపరితాపశాంతికయి కోరఁ డతం డెద లజ్జపెంపునన్.

క. ధారాజలలవదుర్దిన
కారితధారాగృహంబుఁ గన్గొనఁ గనం
డారాధింపఁడు సుమరస
వారప్లుతశీతలోపవనవాటికలన్. 80

గీ. మందుదహనాత్మకము గాక మఱి దహించు
స్నేహకాష్ఠచయంబు నశింపనీక

బూదిచేయదు దుఃఖానుభూతి కంగ
మతనికామాగ్ని కడుదుస్సహంబు కాదె. 81

వ. అట్టితఱినయిత మారాకౌమరుండు 82

సీ. కృశతనే మేని కంగీకరించెనుగాని
సిగ్గుపోకకు మనం బొగ్గలేదు
తనుపోషణాన యనాదరము చూపెనుగాని
వంశగౌరవ మింత వదలలేదు
ప్రజలసేమంబును పాటించెనేగాని
మన్మథోత్కలికల మ్రొగ్గలేదు
ఆత్మసౌఖ్యంబుల నణఁగఁద్రొక్కెనెగాని
ధైర్య మొక్కప్పుడుఁ దలఁగలేదు.

గీ. ఇట్లు కాదంబరీగతాహీనరాగ
పాశముల ముందరకు లాఁగఁబడుచు గురుల
ఘనతరస్నేహరజ్జుల వెనుక కీడ్వఁ
బడుచుఁ గొన్నాళ్ళు యుగములపగిదిఁ గడపి. 83

వ. ఒక్కనాఁడు పొద్దుపోకకు సిప్రాతటంబునఁ దిరుగాడుచు దూరంబునఁ దురంగమయూధం బరసి తదుదంతం బెఱుంగ నొక్కని నట కంపి తానును నూరుదఘ్నం బగుతజ్జలంబు దాఁటి కార్తికేయాలయంబునఁ దత్ప్రతివార్తకు నిరీక్షించుచుఁ బత్రలేఖం గని, పత్రలేఖా! అల్లదే యాయశ్వవారంబునడుమ మయూరపింఛాతపత్రంబుతో వచ్చువాఁడు కేయూరకుం డనితోఁచెడి ననుచుండఁగ నే పూర్వప్రేషితుం డగుపురుషుం డరుదెంచి రాసుతా !

యావచ్చువాఁడు కేయూరకుం డన నంతలోఁ జూపుచేతనే
కాదంబరీపరితాపం బెఱిఁగించు కేయూరకు రా రమ్మని చేరఁ
దీసి కౌఁగిలించికొని. 84

క. నీదర్శనభాగ్యంబే
కాదంబరికిఁ సఖికిఁ గల్యాణం బా
వేదించెఁ దెలిపెదవు తె
మ్మా దేవినుడుల్ శఠిశ్రీమాపనయముపైఁ. 85

ఆ. అనుచుఁ బత్రిలేఖ యాతండుఁ దానెక్క
కరిణి నెక్కి యంతిపురముఁ జేరి
దివసవిధుల నెట్లొ తీఱిచి వల్లభో
ద్యానమందు నేకతంబ యుండె. 86

క. కేయూరక ! కాదంబరి
యేయేవార్తలను బనిచె నిప్పుడు మదలే
ఖాయుత యైనమహాశ్వే
తాయువతీవార్త యేవిధంబో చెపుమా. 87

వ. అని చంద్రాపీడుండు పలుకఁగాఁ గేయూరకుండు సప్రశ్రయముగా నెదుటఁ గూర్చుండి యిట్లువిన్నవింపఁదొడంగె.

ఉ. రాజకుమార ! లేదు మదిరాతనుజాత ప్రవృత్తి గాని వి
భ్రాజితకీర్తి హంససుతవార్తయుఁ గాని లవంబ యెప్డు దా
యోజను బత్రలేఖ నటనుంచియు వెండియు హేమకూట మ
ల్లోఁ జని మీర లుజ్జయిని కేఁగుట దెల్పితినో యుఁకప్పుడే.

గీ. అక్కటా ! యిట్టులాయెనే యనుచు వసట
వేఁడినిట్టూర్పుతో మహాశ్వేత తపము

సేయ వెండియు స్వాశ్రమసీమ కేఁగెఁ
జిత్రరథపుత్రిదురవస్థఁ జెప్ప నేల ? 90

క. ఎడఁద ద్రుహిణాభిహతబలెఁ
బిడుగుపడినదానిఁబోలె బిట్టుగ మూర్ఛన్
బడుదానిఁబోలె మదిచే
విడువఁబడినదానిఁబోలె వెఱ్ఱిదివోలెన్. 91

ఉ. ఆతరళాక్షి హంససుతయాశ్రమ మేగు టెఱుంగకే మహా
శ్వేతను దీనిఁజెప్పఁ బనిచేసి నన్నున్, మదలేఖ గాంచి యో
నాతి నృపాలసూతి కిది న్యాయమొకో యని లేచి సెజ్జకున్
వేతను విచ్చి పై ముసుఁగు వెట్టి దినంబును వెళ్లఁబుచ్చెఁగన్.

సీ. అమ్మఱునాఁ డుదయమ్మునన నేను
కాదంబరీదేవికడన నిలువ
మీరు దృఢాంగులై మెయిఁ బ్రాణములఁ దాల్చి
యున్న నే నిట్లైతి నన్నుకరణి
మత్పార్శ్వవర్తులై మనుమీవలన నాకు
మంచి యేమని బెదరించులాగు
ఇంకను హాయెట్టయెదుట నిల్చెదవేమి
యంచున్ గినుక నదలించునట్లు
ఆ. నన్ను బాష్పపూర్ణనయనయుగ్మముతోడఁ
జాలతడవు చూడ జలజనయన
దేవి పనిచినట్లు భావించి దేవర
వారి కిద్ది తెలుప వచ్చినాఁడ. 93

గీ. కాన భవదేకశరణమై కడునిడుముల
పాలయిన యల్లకాదంబరీలతాంగి
ప్రాణములు నిల్పఁ దహతహపడెడునాదు
విన్నపం బాలకింపు మోవిభుకుమార ! 94

చ. అనుపమరూప ! నీదుపథమాగమనం బలకన్యకాలతా
వనమును మందమారుతము వైఖరి నిట్టటు సేయలోకమో
హను నిను నవ్వసంతుబలె నారసినప్డు మరుండు పూనెఁగో
మ్మను మఱి రక్తవంజుళసముంచితవల్లరిఁబోలె భూవరా !

ఉ. ఆమదిరాక్షి నీకయి యహర్నిశముం దపియించుచుండు
నే ! నేమి వచింతు సూర్యుఁ డుదయించినదాది నినాళ్మ
మం దటుల్ ! కోమలిమేన నెప్డు వెలుఁగుం మదనాగ్ని
మరుత్తు వీవకే ! ధూమము గూడకే భసితధూళియుఁ
గ్రాలకె సద్దులేక యే. 96

సీ. పరిచారికాకరాంబురుహాతిమృదులప
ల్లవవీజనములఁ జల్లార దిద్ది
తాళవృంతాంచలోద్వాంతతుషారశీ
కరసేకముల శాంతిఁ గాంచ దిద్ది
హారిశైత్యోద్రారిహరిచందనవిశేష
చారుచర్చల నణగార దిద్ది
దళితముక్తాఫలోద్యద్వాలుకాజాల
ధూలనంబుల నాపఁబోల దిద్ది
గీ. యంత్రిమయకలహంసపంక్త్యాగతాంబు
ధారధారాగృహంబుచేఁ దఱుగ దిద్ది

రాజనందన! గంధర్వరాజపుత్రి
మదనశిఖ యుపచారాళి కెదురు దిరుగు. 97

గీ. చలితజలయంత్రిపటలనిర్గళితము లయి
వితతహిమవారికణతారకితము లైన
సలిలధారలఁ దడిసినకోలఁది నామె
మదనశిఖ విద్యుదనలంబు మాడ్కి మండు. 98

గీ. శిశిరసేవలు మల్లికాశ్రేణియందుఁ
గుందకలికాకలాపంబుఁ గూర్చునట్లు
ఇందువదనతనూవల్లియందు స్వేద
బిందువులఁ గూర్చుచుండె నేమందు నధిప! 99

క. పావకశోధిత మగుచు న
నావిల మగువసనమట్ల నలినాక్షి మెయిన్
లావణ్యము మదనాగ్నిన్
జేవన్ గని తొంటికంటెఁ జెన్ను వహించెన్. 100

గీ. పార్థివకుమార! మృదులస్వభావ మయ్యు
జలము ముక్తాఫలంబుగా వెలయునట్లు
మృదుల మయ్యును నబలలహృదయ మహహ!
కర్కశతఁ గాంచుఁగాదె యుత్కంఠఁ జేసి. 101

క. అంతటివెతఁ గుందుచు న
య్యింతి పతిసమాగమాశ నెటో జీవంబు
తాంత్రింతంబు సేయ దాయమ
సంతాపభరంబుఁదెలుప శక్యమె మారున్. 102

గీ. చండకరతీవ్రతరకరమండలంబు
వేఁడి కోరుచు నెత్తమ్మివిరులుకూడ
వాడుఁ దచ్ఛయ్యలై నరవరకుమార!
యూష్మమున నామె నిర్జించు గ్రీష్మరవిని. 103

ఉ. ఆతలిరాకుఁబోఁడి తనయంఘ్రులలత్తుక యంటి పుష్పశ
య్యాతలిఁ బూలు శోణితమయంబులుగాఁ గనిపింప హృ
ద్వనిర్యాతసరక్తమన్మథశరప్రకరం బనిపించి యెంతయున్
భీతమొనర్చి కంటఁ దడిపెట్టఁగఁ జేయు సఖీసమాజముల్.

గీ. తాల్చు మెయిఁ బుల్కలల్ భవద్ధ్యానజములఁ
గంతుశరవారకం బైనకవచమట్ల
కార్శ్యమునఁ జేసి మంగళకంకణంబుఁ
బతనభయమున నెప్పుడుఁ బైకిఁ ద్రోయు. 105

చ. నళినదళాక్షి యిష్టు చరణమ్ములచే రశనాకలాపముల్
బులకితమా కరంబునఁ గపోలము ఫాలముచేత గంధమ
త్యలఘుసమాగమాశ హృదయంబును దద్ధృదయంబుచే
మహోజ్జ్వలత నిరాకృతప్రసవసాయకు నిన్ను ధరించు
రాట్సుతా! 106

వ. మఱియు నక్కాదంబరీదేవి. 107

సీ. మనమందుఁ బ్రియసఖీమణిచేతబలె మూర్ఛ
చే క్షణక్షణము స్పృశింపఁబడును
దాసిచేఁబోలె నుత్కంఠచే దీనయై
విరిపాన్పునుండి లేపింపఁబడును

స్రస్తాంగియై పరిచారికచేబలెఁ
బీడచే నెట్టొ నడిపింపఁబడును
సతులలో గోత్రస్ఖలితముచేతంబోలె
బ్రితుకుచేతను సిగ్గుపఱుపఁబడును
గీ. చిత్తశాంతికి నుపవనసీమఁ జేరి
కుసుమశయనవిమర్దనకోపమునను
బోలె ఝుంకారరవములు బోరుకలుగ
భృంగసంఘమ్ముచే బెదిరింపఁబడును. 108

చ. స్థలనళినీవనంబులకు సాఁగు నొకప్పుడు ప్రొద్దుపోకకై
కొలఁకులనీట నొక్కపుడు క్రుంకు నొకప్డు తమాలవీథులన్
జెలు లరుదేరఁ గ్రుమ్మరెడుఁ జిత్తము నిల్కడలేక యిట్లు మా
యలికులవేణి నీదువిరహాబ్ధిఁ దరించెడు రాజనందనా! 109

ఉ. ఇందునిభాస్య కిందుఁ డుదయించుడు నేత్రయుగంబు చల్వ
రా। చందముగా స్రవించు ధృతి సంతమసం బటు తూలు
నూరుపుల్। సంద్రపునీటిచాలువలె సందడి సేయు మనం
బు తమ్మిదా।రిం దెగు దర్పకుండు చెలరేగు మహోత్పల
దర్పముఁ బలెన్. 110

గీ. మఱియు శీతజ్వరాతురమాడ్కి మణిమ
హీతలప్రతిబింబితహిమమయూఖ
మండలముపైన వేపథుమత్కరంబుఁ
జాపి ప్రకటించుఁ జంద్రసంతాప మాపె. 111

క. సుదతీరదనాంశుమిషచే
మదనశరప్రకరదళితమానసగతమై

గదుము శశికిరణజాలము
వదనోద్గతముం బొనర్చువడి సీత్కృతులన్. 112

సీ. జలకణికయుఁబోలె జలజాక్షి సతతంబు
కమలదళస్థయై కంపమందు
నీడయుఁబలె నలినీలతైకశిక కటి
కపురాతినేలలఁ గానిపించు
నళినీలత వితాన నాతి శీతాంశుక
రస్పర్శనమునఁ గరంబు వాడు
వరటకైవడిఁ దన్వి సరసమృణాళికా
హారంబుచే జీవ మట్టె నిలుపు
గీ. అల్లయుషకన్యయట్ల మాపల్లవోష్ఠి
మానసమునందు స్వప్నసమాగమమ్ము
చేతనేనియు ధన్యతఁ జెందుఁ జెప్పఁ
దరమె కాదంబరీతాపభరము మాకు. 113

చ. అనుపమరూప! యాపెవలయంబులకై నళినీమృణాళముల్
వనజదళాక్షి మేనికలపంబులకై మలయప్రభూతచం
దనములు పువ్వుఁబోఁడిసుమతల్పముకై పువుఁదోఁటలోని
కొ(రి)! న్ననలు వ్యయంబు లయ్యె ననిన న్మది నమ్ముము
రాజనందనా! 114

గీ. అతనుతాపంబుచే నాపెయవయవములు
ననకృదుపదేశముల వయస్యలనుడులును
అనవరతమోక్షముల మన్మథాయుధములు
క్షీణములు కాఁగఁజొచ్చె నక్షీణవిభవ! 115

క. భూపాలనందనా! క
న్యాపురి నిప్పుడు రహస్యనర్మప్రియసం
లాపములు చిత్రికళ, చం
ద్రాపీడమయమ్ము లనుచుఁ దలపోయు మెదన్. 116

మ. త్వదుపాలంభనగర్భితంబులు రసోద్యన్మార్గధీగీతముల్
త్వదఖండాకృతిదర్శనైకపునరుక్తప్రాయముల్ స్వప్నముల్
త్వదుదారాహ్వయకీర్తనప్రతినివర్త్యంబుల్ మహామోహముల్। సదయా! యిప్పుడు కన్యకానగరిలో సత్యంబు
వాక్ప్రవృత్తిన్. 117

క. అని కేయూరకుఁ డిటు వా
కొనుచుండఁగఁ జింత రాచకొమరుఁడు మూర్ఛన్
గనెఁగాని పూర్తిసెందద
ననబోఁడిదురంత వేదనలవర్ణనముల్. 118

వ. అంతఁబత్రలేఖా కేయూరకులు శిశిరోపచారమ్ము లొనర్పఁ జంద్రాపీడుండు కొంతవడికిఁ దెప్పిఱిల్లి స్ఖలితాక్షరంబుగా నిట్లనియె. కేయూరకా! కాదంబరీదేవి నన్నుఁ గఠినహృదయుఁగా ననురాగశూన్యుఁగా నెఱింగియే నీకు గమనాభ్యనుజ్ఞ యొసంగి యుండదు. మహాశ్వేతామదలేఖలుగూడ నక్కారణంబుననే కబురేని యంపరైరి. నే నిది యంత యుఁ బత్రలేఖవలన నెఱింగితిని. ఇందు నా తప్పేమి కలదు? 119

గీ. శీతకరమూర్తిఁ గనిన నిశ్చేతనంబు
గాఁగఁ దనరారునాచంద్రకాంతమణికి

నార్ద్రిభావంబు స్వాయత్త మగుచుగాక
తత్కరాకర్షణమ్ము సాధ్యమ్మె యెందు ? 120

గీ. భ్రమరయువకుండు కడుఁబక్షపాతి యగుచు
నభిముఖంబుగ నెంతయు నరుగు నంతె
కాని తనివారఁగాఁ బూవుఁదేనె నాన
శక్యమే కళికావికాసంబు లేక. 121

ఉ. వాసరతాపతప్తమయి వందురునక్కుముదాకరంబు తా
గాసిని బాయ నున్ముఖతఁ గాంచెడునంతకు నేమిచేసెడిన్
భాసురచంద్రికావిభవబంధురయా క్షణదాసుతల్లి యు
ల్లాసము పెల్లొసంగి యవలంబన మీయకయున్న నెచ్చెలీ!

ఆ. మాన్యవర్తన ! మధుమాసలక్ష్మిపరి
గ్రహణభాగ్య మద్ది క్రాలకున్నఁ
బల్లవానురాగపటిమఁ జూపునె మహీ
జంబు తనకుఁ దాన సరసమయ్యు. 123

చ. పెదవి మెదల్ప నేమి వినిపించునొ యంచు మొగంబె
చూచు నిప్పదతలవర్తిసేవకులపైఁ గడుగౌరవభావమూని
తా । ముదల యొనర్పకుండు టది ముద్దియత ప్పెటు లప్ప
గించె న । మ్మదిరతనూజ యట్టిసుకుమారశరీరము మన్మ
థాగ్నికిన్ ? 124

క. మదలేఖ యాలతాంగికి
హృదయముగద యకట ! యెట్లుపేక్షించెను దు
ర్మదుఁ డైనమదనహతకుఁడు
మదిరాక్షిశరీర మట్లు మ్రగ్గఁగఁజేయన్. 125

ఉ. అక్కడ నున్నయప్డె తెలియంబడ దిప్పుడెఱుంగ నేమియా
నెక్కడి హేమకూటనగ మెక్కడి యుజ్జయినీపురంబు నే
నక్కడఁ జేరు టెక్కడ ? యనంగుని తూఁపులు మమ్ముఁబోం
ట్లకే । వెక్కసమయ్యెడున్ గలఁచవే సుమకోమలి నేమి
సేయుదున్. 126

క. కట ! దుర్విదగ్ధుఁ డతిదు
ర్ఘటఘటనాపటుఁడు దుఃఖకరశోకసము
త్కటబుద్ధి విధిహతకుఁ డిం
తటితోఁ బోవండు చేయఁదలఁచె నెదో మదిన్. 127

సీ. అశ్వముఖంబుల నంటి యూరక యట్లు
దేవభూముల కేను బోవనేల ?
పోయితిఁబో దప్పి పుట్టుడు నచ్ఛోద
కాసార మచ్చోటఁ గాంచనేల ?
కాంచితిఁబో విశ్రమించి యచ్చోఁ బ్రీతిఁ
గాని యమానుషగీతి వినఁగనేల?
వింటిఁబో యది గనువేడ్కమైఁ బోయి మ
హాశ్వేత నచ్చట నరయనేల ?
గీ. అరసితింబో లతాంగి రమ్మన్నయంత
హేమకూటాచలంబున కేగనేల ?
ఏగితిన్ బో మదిరసుత యాఁజనంబుఁ
గాంచి గాఢానురక్తిఁ జూపించనేల ? 128

శా. ఆనాఁకొఁకకి పుత్రిగాకమునుపే యారీతి మాతండ్రి ' వ
త్సా! నిన్నుం గన వేడ్కయయ్యెనని పత్రిం బంపఁగానేల?

దు। ర్మానుం డావిధి కొండపై నిలిపి యుమ్మాడ్కిఁ ధరఁ
ద్రోచె నఁ। గాని విర్మామెయి జీవ మున్న నెట్టులో కా
దంబరిఁ గాంచెదఁ. 130

గీ. అనుచు రాసుతుఁ డనుచుండ నంత రవియు
నితఁడు కాదంబరీచింతనే తపించె
నాత్మకర తేజమునఁగూడ నలయ నేల
యనియొ యుపసంహృతాంశుఁడై యస్తమించె. 131

వ. అంతఁ గ్రమంబుగా. 132

సీ. సకలలోకములకుఁ జల్లఁదనంబుకై
పట్టిన శ్వేతాతపత్ర మనఁగ
అమృతంపుఁజవి జగం బాతకుఁ దెలుప నా
కసమం దిడినవెండికలశ మనఁగఁ
దొలిదిక్కుఁజవరాలు చెలువంపుమోముపైఁ
జిలికినగందంపుఁ దిలక మనఁగ
ఏకత్ర పుంజితం బై కానిపించు వి
యల్లక్ష్మీలావణ్యాహ్రద మనంగ

గీ. చంద్రభగవానుఁ డారాజచంద్రుఁ జంద్ర
కాజలంబుల నభిషిక్తుఁగా నొనర్ప
నమృతకరముల నంటె మైపోయిఁ గూర్పు
నుదయగిరిశిఖరంబుపై నుదితుఁ డయ్యె. 133

వ. అత్తఱిఁ జంద్రాపీడుండు వల్లభోద్యానమంద చంద్రకాంత
శిలాతలిపైఁ బరుండి పాదంబులొత్త నరుగుదెంచిన కేయూ
రకుఁ గని కేయూరకా! మన మరుగునంతకుఁ గాదంబరీ

దేవి జీవించునే? మదలేఖ యాయిందుముఖిని వినోదపెట్టఁ
జాలునా ? గంధర్వరాజపుత్త్రి నూఱడింప మహాశ్వేత
మరల వచ్చునా ? దేవి యవ్వారలఁ బ్రార్థన నంగీకరిం
చునా ? కోపవక్త్రం బగుగంధర్వసుతమోము మరలఁ
జూడఁగలుగుదునా ? యని యడుగఁ గేయూరకుండు

శా. దేవా ! మీరు ప్రయాణమాటకుఁ బ్రయత్నింపుండు వే
గన్ వయ । స్యావారంబుల సాంత్వనోక్తి పరివారాలాప
మట్లుండ నీపూవుంబోఁడికిఁ ద్వద్దిదృక్షయె కన్నుల్ మూ
యంగనీ దన్నచో । శ్రీవారిన్ బడయున్ దలంపు మదిలో
జీవంబుఁ బోనిచ్చునే ? 135

క. అని కేయూరకుఁ డనఁగా
విని చంద్రాపీడుఁ డతనివిశ్రాంతిఁ గొనన్
బనిచి ప్రయాణవిచారం
బున మునిఁగి తలంచెఁ జిత్తమున నిప్పగిదిన్. 136

ఉ. తల్లికిఁ దండ్రికిన్ దెలిపి తత్పదముల్ ప్రణమిల్లి వారిచే
నెల్లశుభంబులన్ బడయు నిమ్ముగుదీవెన నందకుండనే
యెల్లియ హేమకూటమున కేగిన నేగుదుఁగాక యందు నే
నల్లము నిర్వృతి న్గనునొకో యశమొప్పనె శ్రేయమబ్బునే.

చ. నరపతి యావరాజ్యభరణంబున నన్ నియమించెఁ జెప్ప కే
చరణమునేన్ గదల్చుటకు సాధ్యము నాకొకవేళఁబోయినన్
ధరణి చలింప రాజసముదాయము నన్ వెదుకంగ రాదె
యొల్లరు జనులున్ మదార్తుల నలంగరె నావెను వెంటఁ
బాఱుచున్. 138

చ. జనకున కైన నెవ్వఁ డేఁక ? జాల్ముఁ డితం డిటు పోవునా
యటం। చనుకొని నా కయిన్ గలుగు నాదరమున్ బెఱచోట
నిల్పనా। వెనుక నొకండు లేఁడుగద, విహ్వలనై తలియేనిఁ
దండ్రిగా।రిని నన్నుఁ దేరఁ బోర కెవరిన్ గని యూఱట
మందు నక్కటా ? 139

సీ. తండ్రియే నావెంటఁ దరల సప్తాదశ
ద్వీపయా మహియె యేతెంచినట్లు
అపు డొందుఁ జనుదు నెం దారగింతును నిల్తుఁ
దను వేని నెచ్చోట దాఁచికొందు
జనకునిచేఁ జిక్కికొనియు మోమెటు చూపు
వాఁడఁ బల్కిన నేమి పల్కువాఁడఁ
దల్లిదండ్రుల నిట్లు తల్లడిల్లఁగఁ జేసి
యేను జేయని పాప మేమి యింక

గీ. దండుకొఱకన్న మార్గమధ్యంబునుండి
యే, మరల దానితోడనే యిటకుఁ జేర
వలయుఁగాదే, పితరుల కేఁ దెలిపి యేగు
వాఁడ ననుకొన్న నెటు బొంకువాఁడ నిద్ది 140

మ. ఘనమారాగము నా యెడం బొడమి యక్కాదంబరీదేవి కా
మునిచేతన్ బడెనందునా ? తరుణిపై మోహంబు నా కె
క్కుడ। య్యేను జీవింపఁగఁ జాల నే ననుదునా ? యీ
మాకుఁ గల్యాణమున్। బొనరింపన్ సఖి హంసపుత్రి
నను సంబోధించెనం చందునా ? 141

క. జననీజనకులయాజ్ఞఁ
గొనిచను టది కల్ల యింతకును దిగ్విజయం
బున కేగి మొన్న నేగద
చనుదెంచిన దింతలోనె చననిత్తు రొకో ! 142

క. చననిచ్చెదరే యని యిపు
డనుకొందము మిత్రిసాధ్య మగుపని యిదియొం
టిని గద నే వైశంపా
యనుఁ డేనియు లేఁడుగా యనర్థము వచ్చెన్. 143

చ. ఎవనికి నాదుగోడు వచియింపఁగఁబూనుదు నాలకించి నా
కెవఁడు సదుత్తరం బొసఁగు నెవ్వఁడు మత్సుఖదుఃఖభాగి
గాఁగా। ఎవఁడు రహస్యవేదనకు నిక్క యగుఁ మఱి నాదు
కార్య మిం। కెవనిశిరంబుపైన యిడి యే సుఖియింతు
నతండు లేఁడుగా. 144

గీ. అనుచుఁ జింతించుచుండ నే యరిగె దుఃఖ
దీర్ఘ యగురాత్రి యతనికిఁ దెలియరాకె
ప్రొద్దున నె దండుతో మంత్రిపుత్త్రిఁ డేగు
దెంచె దశపురి కని యాలకించె నతఁడు. 145

వ. ఏమిది. స్మరణానుపదంబ నాకెండవహృదయంబుం బోని
వైశంపాయనుం డరుదెంచుచున్నాఁడని వినవచ్చె. ఇయ్యది
శుభోదర్కంబని సంతుష్టాంతరంగుండై తన్నుఁజేరి నమస్క
రించిన కేయూరకుం గాంచి కేయూరకా ! మనకార్యసిద్ధి
కరతలవర్తిని యని యెఱుంగుము. వైశంపాయనుం డేగు
దెంచెనన్న నాతండును సంతుష్టుండై యిట్లనియె. 146

ఉ. రాచసుతా! మెఱుంగు ఘనరావము కైవడిఁ బాండురో
చియౌ।పాచి సుధామరీచిజనిభంగి మనోజ్ఞవసంతవిభ్రమ।
శ్రీ చిగురుల్ బలెన్ సఖవరేణ్యుని రాకయె మాప్రియాంగ
మున్। సూచనసేయు దేవరకుఁ జొప్పడు దేవిసమాగమం
బిఁకన్. 147

గీ. చంద్రికాశూన్యుఁ బున్నమచందమామ
ననధిగతబిసవల్లిఁ బద్మాకరంబు
పరలతాహీనమా నుపవనతలంబు
నరసిరే యెవ్వరేని నెందైనఁ గాని. 148

గీ. సురభిమాసంబు త్రిజగతీసుభగ మయ్యు
సరససహకారమంజరీసంగమంబు
లేక రాణించనట్లు లోరాకుమార!
చిత్రరథపుత్రి లేనినీచెలువ మట్లు. 149

ఉ. ఓనరపాలపుత్ర! సుహృదుత్తముతో నట కీరు వచ్చు టె
ట్లైన విళంబమాను మదిరాత్మజచిత్తము జాగు సైఁప దీ
లో నిట నుండి చేయుపనులున్ గనుపింపవు నాకు దేవి కీ
వైనముఁ జెప్పువాఁడ సెలవా? దయయుంచుము పోయి
వచ్చెదన్. 150

వ. నావుడు నృపాలనందనుం డతనిదేశకాలజ్ఞతకు సంతసించు
చుఁ గేయూరక! మాయందుఁ గలతావకావ్యాజభక్తికి
మెచ్చితి నీ వేగి దేవీజీవితంబు నిలుపుము. మదాగమన
ప్రత్యయంబునకై పత్రలేఖయు నీతో దేవిపాదమూలంబు
చేరుఁగాక యని మేఘనాదుతో మేఘనాదా! త్రో ల్లఁ

బత్రిలేఖను గొనివచ్చుటకు నిన్నెచ్చట నుంచితినో యచ్చటికే యిపుడు పత్రిలేఖను గొని కేయూరకుతోఁ బోవలయుఁ జుమా యని యానతిచ్చి గమననమస్కారోత్థితుండగు కేయూరకు సస్నేహంబుగా బహూకరించి చరణపతితయగుపత్రిలేఖను గని పత్రిలేఖా! కాదంబరీదేవికి నా శిరఃప్రణామం బెఱింగించి నామాటలుగా నిట్లనుము.

ఉ. ఔర! మొదల్ ననుం గనినయప్పుడె కూర్మిఁజూపుదేవి జో। హారుననేనిఁ గొల్వకె బయల్పడునే నిఁకఁ దెల్పి మూఘత। గౌరవముఁ లఘుత్వమున గణ్యత హీనత, మేల్ కృతఘ్నత। మూరుచుకొంటి నిట్లుగుణమండలి దుర్గుణ మండలంబుచే. 152

గీ. దేవి కేగుణలేశ మీాదీనునందుఁ
గనఁబఱచి వేఁడికొందుఁ జేకొను మటంచు
దేవియే నీస్థితికిఁ దన్నుఁ దెచ్చునన్ను
నాగ్రహింపక యెట్టు లనుగ్రహించు. 153

సీ. ఎదొ మాయచేసి నామది మోసగింపలే
దా యన్నఁ బల్కు లేదామె మాకుఁ
గల్లకూరుములు నాయుల్లంబుఁ గొనఁగలే
దా యన్న మాట లేదామె మాకు
ఈ నాదురవస్థ కీవె తావలము కా
దా యన్న మాట లేదామె మాకుఁ
గాలవిళంబంబు గావించినావు గా
దా యన్నఁ దిరుగు లేదామె మాకు

గీ. అక్కటా! యిట్లు సర్వదోషాశ్రయుండ
నైననే నేమిసందేశ మంపువాఁడ
నాదుతప్పిదముల్ సైఁచి నన్ గ్రహింప
దేవిసద్గుణజాలమే దిక్కు నాకు. 154

చ. లలనరో! నీ స్వభావసరళత్వమె దూరగతున్ ననున్
స్మరా। నలపరిదహ్యమాను నవనంబొనరించెడిఁ దావకీనవ।
త్సలతయె యాభిముఖ్యము నొసంగు భవన్మృదుమాన
సంబె యం। ఘ్రులఁబడి దేవిరించుననుఁ గోపము సేయక
గారవించెడిన్. 155

క. మగువా! నిర్లజ్జుఁడనై
మగుడన్ నీమొగముఁ జూడ మది నెంచుట కే
నగణితవాత్సల్యములై
పొగడం దగునీప్రసాదములె కారణముల్. 156

చ. విపులము లత్యుదారములు విశ్రుతముల్ రమణీ! భవత్ప్ర
సా। దములు క్షణంబయేఁ బరిచితంబులయేనిఁ ద్వదంఘ్రి
సేవనో। ద్యమమున కెచ్చరించును విదగ్ధుఁ బొనర్చు స్వ
సేవఁ జాటుకృ। త్యములకు దింపుఁ గొంతతడవైనను ని
ల్వఁగనీయ వొండెడన్. 157

గీ. అత్యనుగ్రాహకము లౌట నపరిహార్య
తమము లోయింతి! నీ ప్రసాదములు నిజము
ఈదృశగుణంబు లగుటనే యింతమేర
కేను గొనిరాఁబడుచునుంటి నిందువదన! 158

వ. కావున 159

క. దేవి ! మదాగమనము వృథ
గావింపక నాకు నిజగము శూన్యముగా
భావంబునఁ దోఁపింపక
దేవిమొ నిల్పుకొనవలయు దేవీతనువుః. 160

వ. అనిసందేశించి మఱియుఁ బత్రిలేఖా! దారియందు మద్విర
హాసంతప్తవు గాకుము. శరీరసంస్కారాదుల నేమఱ
వలదు. నిన్నాంటిఁబంపుటకు నామనంబు వెనుకాడుచు
న్నది. ఏమిచెప్పుదు. నీకంటె దేవీప్రాణంబులే వల్లభత
రంబు లయ్యె నని వాకుచ్చి గాఢాలింగన మొనర్చి య
మ్మగువను బంప నామెయుఁ గేయూరకమేఘనాదులతో
నిర్గమింపుమఁ జంద్రాపీడుండు వైశంపాయనప్రత్యుద్గమ
నంబునకై యాజ్ఞఁగొనఁ దండ్రి చెంతకుఁ జని ప్రణమిల్లి
నఁ దారాపీడుండును సబహుమానంబుగాఁ బుత్రుఁ జీరి
యంగంబులఁ బుణుకుచు స్నేహనిర్భరమానసంబుతో శుక
నాసుని కిట్లనియె. 161

ఉ. కానఁగనయ్యెఁ జూచితివిగాదె యమాత్య! శశాంకలక్ష్మల
క్ష్మీస్మనిభమై వికాసిసరసీసరసీరుహాసంగిభృంగమా
లానుకృతిః దనర్చునదియై యరిదుష్ప్రసహాస్ఫురత్ప్రతా
పానలధూమరాజిబలె నాత్మజుమోమున శ్మశ్రువల్లికః.

గీ. సచివసత్తమ ! యిద్ది భూ్రిసంజ్ఞ గాదె
మంగళోద్వాహవిధి కిఁక మసల నేల?
సుతున కనురూప యగురాజసుతను గూర్ప
వలదె యనుడు నమాత్యుండు వలికె నిట్లు. 163

చ. బహువిధవిద్యలందుఁ గడుఁబాండితిఁ గాంచెఁ గళల్ గ్ర
హించె ది । జ్మహిళలఁ జెట్టవట్టెఁ బ్రజమన్ననకున్ గుఱి
యాయె రాసిరిన్ । గృహిణిపదంబునం దిడికొనెన్ వహిం
యించె మహిన్ వధూకర । గ్రహణముతప్ప నేకొఱతఁగా
నము పట్టికి రాజశేఖరా ! 164

చ. అని సచివుండు పల్కునెడ నానన మించుకవంచి రాసుతుం
డనుకొనె లోన నాకు మదిరాత్మజపై మదివోయినట్టె మా
జనకుని కీతలంపు తమి సాఁగెడువానికి వెల్తు రబ్ధిలో
మునిఁగెడువాని కోడ వనిఁబోయెడువానికిఁదోడునయ్యెఁబో

వ. మఱియుఁ గాదంబరీప్రాప్తి వైశంపాయనప్రత్యుద్గమనాధీ
నంబని తలపోయుచుండఁ దారాపీడుండు కుమారుఁ దో
డ్కొని శుకనాసుండు తోడ రా విలాసవతీభవనంబుఁ జేరి
యానందనిర్భరమానసుండై పట్టమహిషిం జూచి. 166

గీ. రమణి ! యభినవయౌవనారంభసూచి
రమ్యనూత్నవధూకరగ్రహణయాచి
విస్తృతాస్మద్విలాసనివృత్తివాచిఁ
జాన ! కనవేల సుతముఖశ్మశ్రురోచి. 167

ఉ. కోడలిమాటె యెప్పు డనుకో విపు డేనె చరింప మాటు
మా । టాడవు ప్రీడఁదెల్పుము త్వదాశయమున్ వరమాత
పీవు ప్రూఁ।బోఁడిరో! యీవ యీభరముఁ బూనఁగ నర్హవు
పట్టదేదియున్ । జేడియ! నీకుఁ బుత్త్రిపయి స్నేహము
లేదొకో ? యూరకుండెదే ? 168

గీ. కొంతతడ విట్లు సద్గోష్ఠు లింటితోడ
సలిపి యారాజచంద్రుండు చనిన రాజ
సుతుఁడు సచివునిచే మంత్రిసూను నెదురు
కొనఁగ నడిగించి పడసెను జనకునాజ్ఞ. 169

క. ఆయనఘుఁడు తలిగృహమునం
దే యాపవలెల్లఁ గడపి యెట్లో వైశం
పాయనుఁ జూచుతమిఁ గను
మూయక రేయి రెండుయామములు పుచ్చె నిశన్. 170

సీ. రమణీయకాంతిపూరంబుచే నంబర
కాలిమం బెల్లను గడిగివైచి
క్రమముగా నుర్విజగహనవాటికలలో
హరితత్వమంతయు నపహరించి
దొంగదారులవెంట దుమికి సందుల దూరి
తరుతలచ్ఛాయలఁ దటిమివైచి
దరుల నెందో నక్కి తలదాఁచికొన్న చీఁ
కటిమూఁకఁ బాచబంగళ మొనర్చి
గీ. ముజ్జగంబును వెన్నెల ముంచివైచు
చంద్రికరములు తనకుఁ బ్రోత్సాహ మీయ
బయలుదేరెను జతురంగబలముతోడ
దశపురోన్ముఖుఁడై రాజతనయుఁ డంత. 171

వ. ఇంద్రాయుధజవంబునఁ దెల్లవాఱకమున్నె యోజనత్రయ
పరిమితం బగుమార్గం బధిగమించి. 172

ఉ. శీతమయూఖుఁ డస్తగిరిఁ జేర వియోగినియైన సరోజినీ
చేతము కుందు మాన్పి వికసిల్లఁగఁ జేయ దివాకరుండు రా
గాతిశయంబుతోడ నుదయాచలకూటము నెక్కె నర్ధగ్రగీ
ప్ర్యాత్రిపథంబునందుఁగనె నొక్కెడ రాతనయుండు దండ్రా

క. కని, కనియెద వైశంపా
యను నతనికిఁ దెలియరాక యని రాచిన్నెల్
గొనక తల నుత్తరీయం
బునఁ జుట్టి తురంగ మెక్కి పోయి యచటికిన్. 174

చ. అచటఁ గలట్టివారిఁ గని యాదరమొప్పఁగ నెందుఁ గ్రాలె
డిన్ । సచివకుమారుఁ డంచడుగఁ జానలు కన్నుల నీరు
గార్చుచున్ । సచివకుమారుఁ డిం దెటఁ గనంబడు నన్న
నిటుల్ వచింతురే । ల చెనఁటులార! యేం చెద కలంగఁగ
వెఱ్ఱియుఁబోలెఁ బోవుచున్. 175

ఆ. ఎవరి నడుగ వార లేలాటిదుర్వార్త
వినుతురో యటంచు విభుసుతుండు
కడుభయంబుతోడఁ గటకమధ్యము దాఁక
నేరి నడుగకుండ నేగ నపుడు. 176

వ. రాజమండలం బింద్రాయుధపరిత్యక్తాభిజ్ఞానంబుచేఁ జంద్రాపీడుం
డని యెఱింగి సమీపించి యుద్బాష్పదృష్టియై పరిణమిల్లిన
రాసుతుండు వైశంపాయనుం డేఁడీ? యని ప్రశ్నింప యువ
రాజా! యీతరుతలంబునఁ గూర్చుండుఁడు. తద్వృత్తాం
తంబు విన్నవింతు మన్న సమ్మాత్రకే సొమ్మసిల్లి యువ్వారి
శీతలోపచారంబులఁ గొంతవడికిఁ దెప్పిఱిల్లి వైశంపాయనుఁ

గానమి నేమియుం దోఁచక వెఱ్ఱివాఁడై యెటకుఁ బోవుదు నేమిచేయుదుఁ బ్రాణంబుల విడుతునా యనుకొనుచుఁ గింక ర్తవ్యతామూఢుండై దుఃఖాగ్నిదందహ్యమానుం డగుచు నాత్మగతంబున. 177

సీ. చిత్ర మెంతయు నిది జీవలోకము రమ్య
మయ్యు నామది కరమ్యముగఁ దోఁచె
జగము శూన్యంబుగా నగిపించెఁ గనులున్నఁ
గడలు చీఁకట్లుగాఁ గానిపించెఁ
బ్రాణముల్ దాల్చినఫల మేమి? మదిరాత
నూభవతో నైనలాభ మేమి?
దొరకునే తల్లకిరిందుగఁ దపం బొనరింప
నైన నా కీలాటియాప్తముఁడు

ఆ. తండ్రిమొగము నెట్లు దర్శింతు శుకనాసు
నెట్లు గందు మిత్త్రిఁ డేఁడి యన్న
నేమి చెప్పువాఁడ నెటు మనోరమఁ దేర్ప
నోపువాఁడఁ బుత్త్రిఁ జూడకుండ 178

క. అని తలఁచుచుఁ దల యెత్తకె
యనె నిటు మాచనినపై మహాకదనంబా
ఘనరుజయా యీముష్కర
మన కిడె ననవుదు నృపాలమండల మనియెఁ. 179

గీ. పాపము శమించుఁగాక భూపాలతనయ!
సచివపుత్త్రిందు తమయట్ల శతసహస్ర

హాయనంబులు జీవించు నతఁడు సుఖియై
యతనిరామికి హేతువు నవధరింపు. 180

ఉ. ఏలినవార లట్లు సెలవిచ్చి చనన్ మఱునాఁటియం దుషః
కాలమునందె యాత్రికులు కండని యెల్లర కేము చాట,మీ
బాలసుహృద్వరేణ్యుఁ డిటు పల్లెను మాకడ కేగుదెంచి యీ
వేళ నిటన్ వసించి కదలెన్ దరియించితము రేవు వేకువన్.

శా. ఈయచ్ఛోదము పుణ్యతీర్థము పురాణేడ్యప్రభావం బిదం
తోయస్నానము లాడ మర్త్యులు నమర్త్యుల్గారె యేతత్తటిన్
శ్రీయోదాత చరాచరప్రభువుఁడౌ శ్రీశంకరుం డంబికా
సాయుజ్యంబుననుండు నమ్మహితుఁ బూజాయోజనన్గొల్వనా

వ. అని పలికి కాలినడతోన యచ్ఛోదంబు చేరి దానిరామ
ణీయత కచ్చెరువందుచుఁ దత్తటంబునం దొక్కెడ. 183

చ. అవిరతతద్వరోర్మిమృదులానిలచాలితముల్ సురాంగనా
శ్రవణశిఖాఽధిరోహగురుసత్కృతిపాత్రములై తనర్చు లేఁ
జివురులచేతఁ బుష్పరససీధువరిగ్రహభృంగఝుంకృతిన్
దవిలితనున్ ద్వరన్ బిలుచుదానిఁ గనుంగొనెఁ దీవెపందిలిన్.

సీ. అది పట్టపవలేని నంతస్సుచే రేయి
కభయమ్ము దయచేయునట్లు దోఁచు
అది శైత్యమున కిక్కయై నటద్బర్హిణ
జాలమై వర్షర్తులీల వెలయు
అది సుమనారాచుసుదతి వేడ్కఁ సెలంగఁ
బ్రొద్దుపుచ్చెడుతావు పోల్కి నొప్పు

అది సర్వతాపసముదయంబులకు మంచి
ప్రతిపక్షపక్షంబు పగిదిఁ గ్రాలు

గీ. అదియు పువ్వులు కాని ముఖ్యాశ్రయంబు
అదియు యామని వెడలుట కనువుదారి
దండితారాతి! యీలతామండపంబు
చెలువ మభివర్ణనముసేయ శేషుతరమె ? 185

ఆ. దానిఁ జూచుఁ జూచి తలయూఁచుఁ దల యూఁచి
చింతఁ జెందుఁ జింతఁ జెంది యేదొ
తలఁపునకును బాఱఁ దల్లడం బందును
సచివసుతుఁడు రాజచంద్ర! వింటె. 186

గీ. ఏతదీయవికారంబు లెల్లఁ గనుడు
నీవిధిగఁ దోఁచె నీలాటితావు లరయఁ
బరిణతాత్ములయందె భావములు మాఱు
నన్నఁ బ్రథమవయస్కుల నెన్న నేల ? 187

వ. ఈతఁ డతిలోకం బగునేతద్రామణీయకంబు తలపోసి తల
పోసి యిట్టి మనోవికారంబునకు గుఱియాయెఁ గాని మ్మొ
ఱింగింతమని మేము నాతనిఁ జేర నరిగి. 188

ఉ. మంత్రికుమార! వేగపడుమా తడవాయెను మజ్జనంబు గా
వింతము రమ్ము చూడమొకో వేడుకఁగూర్చుకు తీవెపందిరిన్
స్వాంతముఁ ద్రిప్పు మింటిపయి సైన్యము నీకయి వేచియుండె
నం! చెంతవచించినన్ వినఁడ యేమియుఁబల్కఁడ యేమి
చేయనా. 189

చ. మఱిమఱి మేము సల్లె పలుమాఱులు వల్కఁగ నాతఁ
డల్కమైఁ। బరుషవచస్కుఁడై యిటులు పల్కెను నే నిట
నుండి రాను మీ। రరుగుఁడు మీకు నొక్కక్షణమైన ని
టన్ వసియింపరాదు భూ। వరసుతుఁ డేగఁ దద్బల మపార
ముఁ గొంచిట నుండఁ బాడియే ? 190

గీ. అనుచు దైవికముగ వాని కంకురించె
నధికవైరాగ్య మని యెంచి యాత్మలోన
మెల్లగా బోధచేసిన నొల్లకున్న
గట్టిగా నిట్టు లంటిమి తుట్టతుదకు. 191

సీ. మాకిట నిల్వ ధర్మమ్మగా దంటివి
ధర్మమే నీకు నీదారిఁ బలుక
రాజేంద్రతనుజాత రాజేంద్రసృష్టఁడౌ
శుకనాసమంత్రికి సుతుఁడ వీవు
దేవి విలాసవతీరాజ్ఞి పెంపఁ జం
ద్రాపీడుతో వృద్ధిఁ దనరినావు
రాజకుమారునితో జోడుగా దీక్ష
సకలశాస్త్రంబులు చదివియుంటి
ఆ. యిట్టివాఁడ వనుచు నెద నమ్మి యువరాజు
సేన నీకు నప్పఁజెప్పి చనిన
దాని వీడి యిటనె యే నుందు మీ రింటి
కేగుఁడని వచించు టేటిపాడి ? 192

శా. నీపై మాకుఁ గలట్టిభక్తి మఱియున్ నెయ్యంబు నట్లుండ
నీ। యీపెన్గాన నిరున్ ద్యజించి చన మా కేరీతిఁ గాల్లాడు

మా। భూపాలాత్మజుఁడేని యేమి యనుఁ దప్పుంగాఁదలం
పండె చం। ద్రాపీడుం డొకరుండు నీవొకఁడవా రమ్మా!
యమాత్యాత్మజా! 193

క. అని మేము పట్టువట్టిన
ననె నాతం డింత తెలియనట్టిఁడనె? సఖుం
గనకుండ నొకక్షణంబై
నను నిల్చితినొక్కో యేమనన్ గలవాఁడన్. 194

మ. మన మేదో స్మరియించున ట్లితరమున్ మన్నింప దేదో
కనుల్। కనుచున్న ట్లిఁక నొండుఁ గాంచ వఱుగుల్ కట్టం
బడెంగా యనన్। జన నుత్సాహముఁ జూప డితను విటన్
సంకీలితం బన్నటుల్। తన రేన్ నా కట కేగు దేరఁగ సమర్థ
త్వంబు లేదయ్యెడిన్. 195

క. నను బలవంతము మీఁదన్
గొనిపోయిన నచట బ్రతుకుఁగొనఁ, జనుఁ డింకన్
మనినన్ని నాళ్ళు నృపనం
దనదర్శనసుఖము మీఁకుఁ దనరెడుఁగాతన్. 196

వ. మందభాగ్యుఁడ నా కది సంభవించియు దూరాపాస్త
మయ్యెనని లేచి యందలియందంబు లగుప్రదేశంబు లార
యుచు నేదో పోయినదానికై వెదకులాడువానివలె ననన్య
దృష్టియై తిరుగుచు వెండియుఁ దొల్లింటి లతామండపంబే
చేరి మాబలవంతముపై నెట్లో వన్యాహార మారగించెను.
పదంపడి యాతనివృత్తాంత మారయ మే మటనే మూఁడు
దినంబు లుండి యాతనిరామికి వగచి తద్రక్షణార్థంబు

కొంతసేన నునిచి వచ్చితి మనివిన్నవింపఁ జంద్రాపీడుండు
కలలోనేని వైశంపాయనుం డిట్లగునని యెఱుంగనివాఁడ
గుటచే మనంబున నిట్లు తలంపఁ దొడంగె. 197

గీ. చిఱుతప్రాయంబునందె నాచెలిమికాని
కింతనిశ్చలవైరాగ్య మేల కలిగె?
నాదోసంగున నిటు లాయెనా యటన్న
నే నొనర్చినయపకార మేమి గలదు? 198

మ. ఇతనిన్ గూడ జనంబు నన్ను బలె నెంతేఁ గొల్చు నాకున్
బలెన్ । దతచూడామణిరోచు లంఘ్రితలి నృత్యంబాడ
నిమ్మేటికిన్ ।క్షితిపాలౌఘము మ్రొక్కుఁ జేయుఁ బనులన్
జేసేత నాకుంబలెన్ । సతతం బాశ్రితకోటి వీని కెటు లీ
సౌఖ్యం డిటుల్ మాఱెనో ? 199

మ. జనకాదుల్ గృహమేగుదేర నెపుడేన్ సంభావితుం జే
యరో ।వినయాధానము పొంటె రూక్షముగ నేవేఁ బల్కిరో,
లేక చు। ల్కనఁగాఁ జూచిరో యానుగా కితఁ డెఱుంగం
జాలఁడే యద్ది దు। ర్జనున ట్లంతటితోనె యుక్కృతి యె
టుల్ సంబంధమున్ వీడెడున్. 200

శా. వైరాగ్యంబునకేని యిద్ది సమయంబా లేఁతప్రాయం బ
హో । దారాపత్యసుఖాదులన్ దనిసెనే ధర్మేచ్ఛ నిట్టుల్
భవాం।భోరాశిన్ దరియింపఁబూనఁ ద్రిఋణంబుల్ దీర్చెనే
యయ్యో ని । స్సారంబౌ నిటువంటిపూనిక కెటు వైశం
పాయనుం డొగ్గెనో. 201

వ. అని చింతించుచుఁ దత్తరుతలంబందఁ శూన్యహృదయుండై
కొంతతడ వుండి రాజలోకంబునకు ననుజ్ఞయొసఁగి పటమం
డపంబునఁ దనకుఁగా సిద్ధంబుగావింపఁబడిన శయనీయ
మధిరోహించి చంద్రాపీడుండు 202

సీ. తల్లిదండ్రులకు నేతద్వార్తఁ దెలుపక
శుకనాసుఁ దత్పత్నిఁ జూడకుండ
ఇటనుండి యే నెటో యేగుదుఁగాక వై
శంపాయనునితప్పి సలుపుచుఁగద
ఊరికే చన వెండియును బంపుదురె యంచు
మన మిప్డు డోలాయమాన మయ్యె
సచివాత్మజుని దేరఁ జనువాఁడ నన్నఁ బా
పెద రన్నధైర్యంబు పెద్ద గలదు

గీ. అపుడు కాదంబరీదేవి నరయవచ్చు
నిల్లు చేరుటె కర్తవ్య మిపు డటంచు
నాఁటిరేయికడం బ్రయాణమ్ము చేసి
సేనతోఁ బ్రొద్దుపొడువ నుజ్జేనిఁ జేరె. 203

క. చేరి నృపాలయసింహ
ద్వారము హరి డిగ్గి తల్లిదండ్రులు సచివా
గారమున నుండి రని విని
చేరు చటకు వినియె నిటు సచివసతినుడులన్. 204

సీ. అకట! వైశంపాయనా ! నేఁటికి మదంక
లాలనీయుండవా బాలకుఁడవె

శతసహస్రవ్యాళసంకులశూన్యాట
వుల నేవిధంబుగా నిలిచి తయ్యా!
క్రూరమృగంబుల బారిని బడకుండ
నందు నిన్నెవ్వార లరయువారు
ఆఁకలిదప్పుల నరసి నిద్దురవేళఁ
గనిపెట్టి యెవరు నిన్గావఁగలరు
గీ. తుల్యసుఖదుఃఖయోగా పడఁతుకయును లేదె
యీవు రాఁగానె మాతండ్రి నెట్లొ వేఁడి
కోడలిముఖంబుఁ జూడఁగాఁ గోరుచుండ
నయ్యె నీదర్శనమె కఱవయ్యెఁ దండ్రి. 205

క. తడవేల నీకు నచ్చిన
యెడకున్ మాతండ్రి నడిగి యెట్లేని నన్నున్
గొడుకా! కొనిపొమ్ము నిన్నున్
విడిచి క్షణంబేని మనఁగ వీలా నాకున్. 206

ఉ. చిన్నతనంబునందయినఁ జిన్నికుమార! యొకప్పుడేనియున్
నన్నవమానమున్ సలిపినాఁడవు కావు గదోయి, యిప్పు
డీ వన్నెగ నాకు మేటివలవంతలు గూర్పఁగఁ జెల్లునోయి
నీ వెన్నఁడుఁ గోపమే యెఱుఁగవే యిపు డేటికిఁ గిన్క
నాపయిన్? 207

గీ. తనయ! మాతోడఁ జెప్పకే తరలి తనుచు
నిన్నుఁ గినియము రావోయి కన్నతండ్రి!
తల్లిదండ్రులనెయ్యంబు నుల్లమందు
మఱచినాఁడవె పరదేశపరిచయమున. 208

మ. యువరాజుం గనకుండ నొక్కక్షణమే నుండంగలే వేగతిఁ
దవిలెన్ నీమది నింతకర్కశత చంద్రాపీడుపై నాయనా!
భవికంబే యిది నీకుఁ బెద్దలకు శుగ్భారంబుఁ గల్పింప నీ
కవుపుణ్యం బది యేమి కుఱ్ఱ! యని యత్యంతంబు వా
పోవుచున్. 209

గీ. తనదుజనయిత్రి చెంత నోదార్చుచున్న
నేవియో పరిలపించుచు నేడ్చుచున్న
సచివసతిదీనవాక్కులు శ్రవణగతము
లగుడు యువరాజు మదిఁ గడునార్తిఁ గుంది. 210

వ. అభ్యంతరంబుఁ జొచ్చి తండ్రికిఁగూడ వదనంబుఁ జూప
మది లజ్జించుచు సచివసత్తమునకును జనకునకును నమస్క
రించి దూరంబునఁ గూరుచుండిన నొక్కక్షణంబు తనయుఁ
బరికించి తారాపీడుండు దుఃఖాశ్రుగద్గదం బగుస్వరంబుతో

మ. తనయా! నీకు నమాత్యనందనునిమీఁదన్ బ్రేమ నీజీవితం
బునకున్ మిన్నయె, యెప్పుడేని హితులే పో దుఃఖముం
గూర్తురే! యనఘున్ దొడ్డాకనిరాని నేరము త్వదీయం
బం చెదన్ దోఁచెనా! కనుచుండంగనె మంత్రిజేనినుడి
కడ్డై పల్కనీరీతిగన్. 212

క. సకలబుధవినుతిపాత్రా!
కకుబంతవిశాలకీర్తి! కరుణామూర్తీ!
ముకురాయమాణధిషణా!
సుకవిత్వరహస్యవేది! సూనృతవాదీ! 213

చ. అతులవచోభిరామ ! తురగాననదివ్యపదాబ్జబంభరా
యితహృదయా ! సదానకలనేడితబాఢతరప్రభావ ! యు
ద్ధతపరవాదిమత్తగజదర్పవిఖండనకేసరిప్రథా !
మతిధిషణోపమాన ! కవిమండన ! గర్తపురీవిరాజితా !

(రథోద్ధతము)

రాజమానితసరస్వతీనటీ
రాజమానముఖరంగ ! పండితాం
భోజమండలనభోమణీసుదృ
గ్రాజ ! శిష్యజనకల్పభూరుహా ! 215

—* గద్యము *—

ఇది శ్రీకాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్త్ర సకల
విద్వద్విధేయ పూర్ణప్రజ్ఞనామధేయప్రణీతం
బగునాంధ్రకాదంబరియందు
షష్ఠాశ్వాసంబు

ఓమ్
శ్రీహయగ్రీవాయ నమః.

# ఆంధ్రకాదంబరి

## సప్తమాశ్వాసము



రమణీరమణపదాం
భోరుహభృంగాంతరంగ ! భూపార్చిత ! గం
గారయవిలంఘివాఙ్ముఖ
ధారాప్లావితమహాంబుధా ! కృష్ణకవీ ! 1

వ. గురువర్యా ! మహర్షి యగు జాబాలి యాశ్రమవాసులకుం జెప్పినట్లు శుకంబు శూద్రకనృపాలున కాకథ యిట్లు వినిపించె. అవ్విధంబున సమాత్యవర్యుం డగుశుకనాసుండు చంద్రాపీడ వైదోషంబు శంకించుచు తారాపీడమహీపాలున కిట్లనియె. 2

మ. జ్వలనంబందున శైత్యమబ్బునెడఁ దైక్ష్ణ్యంబు బాలార్కునం
దపిప్రియ ! మాల్యమున్ననడి సూర్యనందనుం దమంబున్

రేయియందుఁ బవల్ । జలధిఁ శోషము శేషునందు మహీ
నిచ్చల్ మోవఁగా లేమియుఁ । గలదేనిఁ యువరాజునందు
దోసఁ గోత్రకాంత! యూహింపనా. 3

శా. ఏతత్తత్త్వ మెఱుఁగకుండ నృపతీ! యేలా? యనాత్మజ్ఞు దు
ర్జాతుఁ మూఢుఁ గృతఘ్నుఁ బాతకిని మిత్రద్రోహి రా
జాహితుఁ । మాతాపితృపకారిఁ గూర్చి గుణసంపత్తిఁ
మిమ్ముఁ మించున । ద్రావతస్తుత్యు నుదారు మీకొమరుఁ
జంద్రాపీడు నోనాడఁటల్. 4

గీ. అన్యులే గుణి దోషిఁగా నరసిరేని
అంతకుం గష్టతమముఁ బీడాకరంబు
వినము కన మనఁగా గురుజనమె యిట్లు
తలఁచు నెడ వేఱ చెప్పఁగావలెన చెపుమ. 5

శా. దేవా! పుట్టినదాది మీరలును మీదేవేరియుం జూపుప్రే
మాతిష్టంబుల నంకలాలనలనే నాత్మఁ దలంపంగఁబోఁ
డావాయుంబలె దుర్గ్రహప్రకృతియా నజ్ఞాని మూఢాత్ము దు
ర్భావుఁ వీనిని నేమిసేయు మనచంద్రాపీడుఁడేనిఁ నృపా!

మ. తనుసంభూతము లౌమహాక్రిములు నుద్యద్దోషభూయిష్ఠ
ముల్ । ఘనరోగంబులు దుర్విపాగ్ర్యసముదగ్రంబుల్ మహా
హుల్ వినా । శనిమిత్తంబులు నైన దుశ్శకునముల్ చర్చింప
నిద్ధ్రజ్ఞనుల్ । జనియింతుర్ తమయంతఁదామగఁ దమశ్ఛన్న
ప్రదోషాకృతిఁ. 7

సీ. వీరు స్నేహమునసే పారుష్యము వహింతు
సహకళంకకృపాణచయమువోలెఁ

గరికపోలములట్లు కలుషాత్ములౌ వీర
లతికలుషత దానగతిని గాంత్రు
నిర్వర్తకములౌ మణిప్రదీపము లట్లు
జ్వలియింత్రు వీరు ప్రసాదముననె
అంగలగ్నములౌ భుజంగంబులటు వీరు
దాక్షిణ్యమున వామతఁ ధరింత్రు
గీ. ముకురములయట్లు భూతిసముద్వహమునఁ
జేసి వీ రాభిముఖ్యంబుచేత సర్వ
మును మహీతలి నపసవ్యముగ గ్రహింత్రు
మేదినీనాథ ! వీరికి మేలు గలదె ? 8

సీ. సాధువులందు నసాధుప్రవర్తనుల్
పరుషభాషలు స్నేహభరితులందు
నమ్మువారలకు మోసమ్ముఁగూర్చెడువారు
శూరాతిశూరులు సుదతులందు
దయనీయులందును దారుణమానసుల్
క్రూరు లెంతయుఁ బరివారమందు
వినయభూషణు లైనజనులందు నుద్ధతుల్
వక్రులు ఋజుమార్గవర్తులందు
గీ. గుణులయెడ నెంతయేనియుఁ గొంటెగాండ్రు
ప్రీతియుతులందు నైతము ద్వేషమతులు
నెయ్యురంబును ద్రోహాతినిష్ఠురాత్ము
లెవ్వ రవ్వారిలోపల నీతఁ డొకఁడు. 9

గీ. ఇట్టివిపరీతబుద్ధుల కేమి చెప్ప
గురులె లఘువులు లఘువులే గురులు మఱియు

మిథ్యయే తథ్య మవినయమే నయం బ
ధర్మమే ధర్మ మల యవిద్యయ సువిద్య. 10

సీ. వీరికిఁ జదువు వివేకంబునకుఁ గాదు
పరవంచనక్రియాపటిమకొఱకు
వీరికి బల ముపకారంబునకుఁ గాదు
ప్రాణులకుఁ భంగపాటుకొఱకు
వీరి కుత్సాహంబు కీరితిఁ గొనఁగాదు
ధనసమార్జనపుఁ గృత్యంబుకొఱకు
వీరి కీవులు ధర్మసారతకై కాదు
వివిధకామసుఖానుభవముకొఱకు

గీ. పెక్కు లేమిటికో లోకవీర! యిట్టి
తుచ్ఛమతులకు సర్వంబు దోషమునకె
గాని గుణమున కేదియుఁ గాదు సత్య
మీదృశులలోన నొకఁడు గాఁడే యితండు. 11

సీ. తలఁచెనే సఖుఁడు చంద్రాపీడుఁ డాతని
కేరీతి ద్రోహంబు నెంతు ననుచు
శంకించెనే యిట్టిపంకిలాత్ములను దం
డించుఁ దారాపీడనృపతి యనుచుఁ
దలపోసెనే కన్నతల్లి కొక్కండనే
నే, నను విడి యామె నిలువ దనుచు
ఎంచెనే పిండ మాశించి నను గనెఁ దండ్రి
తగ దాజ్ఞ లేక యాతెగువ యనుచు

ఆ. ఈకుమార్గగామి యీకుదృష్టి యెఱుఁగఁ
డకట! దుర్దశంబు నగునదృష్ట
మెఱుకపడునె యద్ది యేఁతాదృశున కవి
వేకతిమిరదృష్టివిరహితునకు. 12

క. మీ రీతిర్యగ్జంతువుఁ
గీరంబుం బోలెఁ బెంచి కించిద్విద్యన్
నేరిపితి రంతె, యీగుణ
దూరాత్మునికంటె నవియె తోసముఁ గూర్చున్. 13

ఉ. పెంచెడువారిపైనఁ గడుఁ బేరిమిఁ జూపుఁ గృతంబెఱుంగు లా
లించెడువారిమచ్చిక ఫలింపఁగఁ జేయును దల్లిదండ్రులం
దంచితభక్తి దోఁప నయంబు మెలంగెడు మేలుగాదె తి
ర్యంచము లవ్వి యీయవినయాత్మునికంటెను వేయిభం
గులన్. 14

క. జనుఁ డీతఁ డుద్భవిలి సుఖ
పడఁజేయఁడు మనల నేరఁ బైపెచ్చుడుమల్
గుడిపెన్ దిర్యగ్యోనిన్
బడఁడె యవశ్యంబు నిట్టిబాలిశుఁ డెందున్. 15

గీ. ప్రతిజనుండును స్వహితమో పరహితంబొ
కోరి ప్రయతించు దానిఁ జేకొనఁగ మనల
నిట్టు లాయాసపెట్టెడునీకుమతికిఁ
బరహితము లేదుగద లేదు స్వహితమేని. 16

క. ఈయాత్మఘాతి కివ్విధిఁ
జేయఁగ నేమబ్బె ననుచుఁ జింతించెడు నా

కేయదియు మదికిఁ దోఁచదు
పో, యయోధ్యా ! యితఁడు దుఃఖమున కే పుట్టెన్. 17

వ. అనినొడువుచు హేమంతోత్పలినియుంబోలె సుద్బాష్పం
బగుదృష్టితో నధరంబు స్ఫురింప మన్యువేగంబు నణంచు
కొని నిట్టూర్పు రెట్టింప నున్నశుకనాసుం గని తారాపీడుం
డిట్టులనియె. 18

ఉ. దీపముచేత నగ్నిని బ్రదీప్తమొనర్చుట, వాసరప్రభా
లేపముచే విభాకరు జ్వలింపఁగఁ జేయుట, మంచుతుంపరల్
ప్రాపుగఁ జంద్రునందుఁ జలువన్ గలిగించుట యట్లకాదె మే
ధావరదేవతాగురుల కార్యులకున్ మముబోంట్లబోధముల్.

గీ. సూరిమణికేని మఱి బహుశ్రుతునకేని
వీరునకు ధీరునకు సువివేకికేని
స్వచ్ఛమయ్యు మనంబు కళ్మలతఁ బూను
వ్యథల, వర్షంబుచే సరోవరమువోలె. 20

చ. కలుషితమైన మానసము కంటికిఁ గన్పడ దెద్ది, బుద్ధియున్
దెలియదు పో వివేచన గతించు వివేకమునందుఁ గాన నేఁ
బలుకఁగఁబూనినాఁడ నిటు భావ్య మెఱుంగక లోకవృత్త
మున్ ! దెలియుదు వీవె యోగుణనిధీ! మముబోటులకన్న
మిన్నగాన్. 21

క. అనఘా ! కలదుగదా యి
వ్వనరాశిపరీతభూమివలయము చెప్పు మె
వ్వనికి గతించెనొ నవయౌ
వనము పలువికారములకుఁ బాల్పడకుండన్. 22

సీ. జవ్వనం బొదవ శైశవముతోఁ బాటుగా
గురుజనస్నేహంబు మఱుఁగుపడును
ఈడుతోఁ బాటె యనీదృశం బగునొక్క
యభినవం బగుప్రీతి యతిశయిల్లు
వక్షంబుతోఁ బాటు వాంఛావిశేషంబు
వెడఁదయై మిక్కిలి విస్తరించు
దోరర్గళద్వయితోఁ బాటు బుద్ధియుఁ
గడు స్థూలత వహించి గానిపించు
గీ. బలముతోఁ బాటు మదమును బలియు నూరు
యుగముతోఁ బాటు నవినీతి యొందు హెచ్చు
నడుముతోఁ బాటు శ్రుతము మ్లానత వహించు
నేటి కాకృతితోఁ బాటె యెల్లఁ బొడము. 23

గీ. ధవళ మయ్యు సరాగమై తనరుచుండు
దీర్ఘ మయ్యును మిక్కిలిదీర్ఘదర్శి
కాదు నరులకు నయన మకాలమందు
సచివ ! యేమందు యౌవనజాడ్యమహిమ. 24

చ. చొఱదు గురూపదేశ మది శ్రోత్రములం దుపఘాత మేది
యుఁ। బొరయక యున్న స్త్రీ వలపుఁబోకలకుఁ గుదురొం
నెదఁ గళాం। తరములకుఁ గనంబడునె తా, వతిచంచల
తాలవాలమా। తరళత యుండ నేమిగతి స్థైర్యము నెమ్మ
దికిఁ ఘటిల్లెడిఁ. 25

వ. మఱియు దివసంబు దోషాగమంబునకు మూలంబు. దోషా
గమం బనాలోకనిమిత్తంబు. అనాలోక మసద్దర్శనహేతువు.

అసద్దర్శనం బవివేకనిదానంబు. అవివేకం బసత్పథప్రవృత్తి
కిం దెరువు. అసత్పథప్రవృత్తంబును మోహాంధంబు నగు
మనంబు భ్రాంతంబై యవశ్యంబు స్ఖలితం బగు. మనంబు
స్ఖలింపుడుఁ దల్లగ్నం బగులజ్జయుఁ దోడ్తో స్ఖలితం బగు.

గీ. అవని లజ్జావరణశూన్య మైన డెంద
మందు సర్వావినయమూలకందనిభుఁడు
పుష్పనారాచుఁ డెపుడుఁ గాఁపురముసేయు
వాని ననివార్యు వారింప వలనుపడునె? 27

సీ. పొడము ఛిద్రసహస్రములు మానసంబునఁ
బూవింటివాఁడు కాఁపురముచేయ
ఆఛిద్రములనుండి యడుగంటు సత్త్వంబు
సత్త్వమే యడుగంట సమసెనేని
శీలంబు నిలువంగఁ జేయూఁత యెయ్యది?
వినయావలంబనవిధ మదెట్లు?
తాఁ జేయునెది యనాధారమౌ నాధైర్య
మేడ బుద్ధికి నిల్వ నీడ దొరకు

గీ. ఎవ్వఁ డిట్టిమనము నిగ్రహింపఁగలఁడు
హద్దు మీఱి చరించి విపద్దశాభి
ముఖములోఁ జంచ లేంద్రియములను ద్రిప్పి
వశ్యము లోనర్చుకొనఁగ నెవ్వనితరంబు? 28

గీ. అక్కటకట! లోకగర్హ్యంబు లైన
దుశ్చరిత్రల నెది పాఱఁదోలఁగలదు

అణఁచు నేవెల్గు దోషోదయంబు దృష్టి
వారకంబుఁ దమోవృద్ధికారకంబు. 29

క. అరుదా బహుదర్శిత్వము
తరుణవయసునందు నెవరో ధన్యులకె వయః
పరిపాకమందుఁ బొందుర్
జరితలు ధవళిమను గేశసముదయములతోన్. 30

సీ. విపులమోహామయోరువిషకాలసర్పంబు
కామంబునకు మంచి కాఁపురమ్ము
మదవికారములకు మత్తమాతంగంబు
నిద్రామహాదేవి నిలువనీడ
దుర్విలసితములు దొరయుసామ్రాజ్యమ్ము
దురభిమానమునకు దొడ్డయిరవు
నవరాగపల్లవానన్యదుశ్చరితల
కిక్క జ్ఞానంబున కెదురుచుక్క
ఆ. తరుణతానవావతారమ్ము యిఁక నిందు
విషమతరవిపాకవిషయమార్గ
మందు సంచరించునందఱకుఁ గూడఁ
దొట్రుపాటు ధర నెదో ఘటిల్లు. 31

క. లాలింతురు పాలింతురు
బాలుర నిటువంటివారిపై నావేశం
బేలా ? యార్యునకు నప
త్యాలఘువాత్సల్యమున కిటాడుట తగునే ? 32

చ. పరిణతబుద్ధి! యిట్లు పసిపాపల నాడుదె స్వప్నమందునే
గురువులనోట వచ్చుపలుకుల్ఫలియించు శుభాశుభంబులన్
ధరణిని వారె పేరలకు దైవసమానులు వారిదీవనల్
వరములు వారు కిన్కమెయిఁ బల్కెడిపల్కులె పొమ్ము
శాపముల్. 33

క. మిగా రిటు వైశంపాయను
పై రోషావేశ మూని పలుకం దగునే
ధారుణిఁ బెనుచుతరులనే
నారయుదురు కూర్మిఁ గనరె యాత్మజుల నటుల్. 34

మ. విడు, కోపంబు కుమారుపై సుతు దయన్ వీక్షింపు వై
రుద్ధ్య మిగా! తఁడు గావించిన దేది సర్వము విడన్ దా
నంటయున్ దప్పుగాఁ! దడవన్ జెల్ల దౌకప్పు డద్ది యువినీ
తంబైనఁ దోడ్తెచ్చి యి! య్యెడ కడ్గన్ వలయున్ వయోఽను
చితమా నిద్రానికిన్ మూలమున్. 35

వ. అనంతర మెట్లుచితం బట్లు యొనర్పనగుఁగాక యని తారా
పీడుండు పలుక శుకనాసుండు దేవా! దేవరవా రతివాత్స
ల్యంబునం జేసి యిట్లానతిత్తురేగాని వైశంపాయనునెడ
వైరుద్ధ్యంబు లేదన శక్యంబె? ఈతండు యువరాజును పేడి
ని జేచ్చ చే క్షణంబేని వేఱుచో నుండడనే. ఇంతకంటె వైరు
ద్ధ్యం బేమి కలదు; నాపుడుఁ జంద్రాపీడుఁడు జనకునకుఁ
దనయుఁడలిదోషశంక చేఁ గశాభిహతుండుం బోలె నుద్బా
ష్పదృష్టియె కూర్చుండియే జరిగి శుకనాసునితో మెల
మెల్ల నిట్లనియె. 36

క. అనఘా! విను వైశంపా
యనురామికి హేతు వస్మదపరాధము గా
దని యెఱుఁగువాఁడ నే నై
నను జనకుఁడా యట్లు తలఁప నమ్మరె యితరుల్. 37

మ. అనృతంబుల్ ఋతమౌజగంబున జనంబందుల్ విశేషించి
యుల్ । జనకుండే యిటు లెంచ నేమనుదు దుస్సంభావనల్
దీని నుజ్జనసేయల్ దగుఁగాదె మత్సఖుని వైశంపాయనుల్
దోడ తేఁ । జనువాఁడల్ దయయుంచి నాకుఁ బితృనాజ్ఞల్
వే కటాక్షింపవే. 38

చ. నిరుపమతేజ! చిత్తమున నీ వనుమానము మాను, భూ
మియా । పరిచితపూర్వ మశ్వపరివారము వెంబడిరా హ
యంబుపై । నరిగెదు నాకు భార మణువంతయుఁ గల్గదు,
పంపు మత్సుహృ । ద్వరుఁ బలుమాటలేల గొనివచ్చితి నంచు
నెదల్ దలంపుమా. 39

గీ. బాహ్యఖేదంబుకంటె దుర్భరముకాదె
యేతదీయవియోగసంభూత మంత
రంగఖేదంబు, వెంటనే రాఁగలందు
సేనఁ గొని యని విడిచి వచ్చితినిగాని. 40

క. ఎన్నఁడు వైశంపాయను
మన్నిష్కపటాప్తు వీడి మసలితిఁ జనితిన్
అన్నము మెసవితిఁ ద్రావితిఁ
బన్నుండితి నాడుకొంటిఁ బాడితిఁ జెపుమా. 41

క. వినినప్పుడ యటనుండియు
చనన్నై తిని దోస మిదియు జనకాజ్ఞ జే
కొన కేగినవై శంపా
యనుదోసము నాకుఁ గల్గు నని మంత్రిమణీ! 42

వ. కావున వైశంపాయనుఁ దోడి తేర నార్యులు నాకు వేగంబ యానతియొసంగెదరుగాక, యని చంద్రాపీడుండు వేఁడిన శుకనాసుండు మహారాజుమొగంబై యువరాజిట్లనుచున్నాఁ డనఁ దారాపీడుండు కొంతతడవు యోజించి యిట్లనియె. 43

గీ. సచివ! యీనాళ్ళఁ బూర్ణేందుసహిత జ్యోత్స్న
విధము వత్సగృహీతయా వధువుఁ జూడఁ
దలఁప నేతదుదంతమ్ము జలదకాల
మట్టు లాశానిరోధక మాయెఁ గువిధి. 44

ఉ. ఈతఁడుతప్ప నీకొమరు నెవ్వఁడుఁ దోడ్కొనిరామినిక్కువం
బీతనిపల్కు, బాల్యహితు నెవ్విధి వీడి యితండు నిల్చు నీ
పోతముచేతనే వ్యసనభూరిపయోనిధి దాఁటఁగావలెఁ
జేతమునందు సంశయముఁ జెందక వే యువరాజు నంపుమా.

క. అనఘా! మనవైశంపా
యనుఁగొని వచ్చుటకు సంశయం బింతయు నె
మ్మనమునఁ గొనకయె రాణియుఁ
దనయునకును సెల వొసంగుఁ దథ్యము సచివా! 46

గీ. దూరదేశంబు బాలుండు చేరవలయుఁ
గానఁ గార్తాంతికులచేత గణ్యమయిన

యొకముహూర్తంబు పెట్టించి యోయమాత్య
శేఖరా! పుత్త్రిఁ బయనింపఁజేయు మీవ. 47

చ. అనినిజమంత్రికిన్ దెలిపి యాత్మజు నుద్గతబాష్పదృష్టియై
గనుగొని చాలసేపు మమకారమునన్ సుతుఁజేరి మూడు
మూ । ర్కొనుచు, మనోరమాసహితకున్ జనయిత్రికి
నీప్రయాణమున్ । వినుచు మటంచుఁబల్కి సరవిన్ గృహా
మేగెఁ బ్రధానయుక్తుఁడై. 48

ఆ. అంత రాకుమారుఁ డక్లిష్టవర్ణయై
రహిఁ దలిర్చుచిత్రరథకుమారి
వరణమాలవోలె ధరణీశునానతిఁ
గొని స్వమాతృభవనమునకుఁ జనియె. 49

చ. చని జనయిత్రికిన్ బ్రణతిసల్పి మనోరమకున్ బ్రణామ
మున్ । బొనరిచి కూరుచుండి స్మృతపుత్త్రికవేదనయా
నమాత్యుదే । విని గని తల్లి! నీదుసుతు వేగమ చూచెద
వ్రాఆడిల్లు మా । జనకుఁడు పంచె నన్ను సఖసత్త్రముఁ దో
డ్కొనిరాఁగ నావుడున్. 50

ఆ. మంత్రిభార్య యనియె మాతండ్రి! నన్నిట్టు
లాత్మగమనఘటితి నాశ్వసింతె?
ఏగవలదు పుత్త్రి! యీవొకఁడవు వాఁడొ
కండు గారు నాకుఁ గన్నతండ్రి! 51

క. ఒకయతనిఁ జూడకుండిన
సుకుమారా! నీమొగంబుఁ జూచుటచే మా

మకహృదయ మూఱటం గొను
నిఁక మాబ్రతుకెట్లు నీవు నేగితివేని. 52

గీ. కఠినుఁ డాతండు రాకుండుఁగాక వత్స !
యీవుమాత్రము మముఁ బాసి యేగవలదు
సకలసుగుణాబ్ధి వైనసీయొకనిచేత
నిరువురము పుత్త్రవతులమయ్యెదము మేము. 53

వ. నావుడు విలాసవతి ధైర్యంబుతో నిట్లనియె. 54

చ. ప్రియసఖి ! నీకు నాకు మది భేదము లేమి నిజంబ, బాల్య
మాదియుఁ దనసీడవోలె నొకతీరున నుండిన నీకుమారుఁ
బాసి యొకనిమేషమే నిట వసింపఁగలండె యితండు
పోవుఁగా కయితని నాపఁబోకు మహీకాంతుని యానతి
దాఁట శక్యమే. 55

క. నిరతము వైశంపాయన
విరహావ్యథు నితనిఁ జూచువేడుకకంటెన్
వర మేతదదర్శనకృత
గురుతాప మొకింత యోర్చుకొనుటే మనకున్. 56

గీ. కాన లే లెమ్ము సుతునిప్రయాణమునకు
వలయునేర్పాటు సేయఁగావలయు సకియ !
యనుచు నామెను దోడ్కొని యవ్విలాస
వతి సుతుఁడు రాఁగఁ జనె నిజావాసమునకు. 57

ఉ. అందు నృపాలసూనుఁడు ప్రయాణకథన్ క్షణముండి స్వీ
యమహా మందిర మేగుదెంచి కడుమంతనమందున జ్యోతిష
జ్ఞులన్ ముందుగఁ బిల్చి మంత్రి నృపముఖ్యుఁడు సద్గఁ

బ్రియాణలగ్నముఁ దొందరలోనె మీరలు కుదుర్పవలెన్
జుమ యంచుఁ బల్కినన్. 58

చ. మహీపతినందనా! యిపుడు మంచిముహూర్తమె కాన
మొక్కఁడున్ గ్రహము లటుండెఁగాదె నరకాంతునియాజ్ఞ
యవశ్యకార్యని ర్వహణమునన్ ముహూర్త మవు రాజె
తలంపఁగఁ గాలహేతువి మ్మహి, మది స్వస్థ మెప్పు డదె
మంచిముహూర్తమటంచు వా రనన్. 59

ఆ. తండ్రిసెలవటంచుఁ దమ్మడిగెదఁగాని
దినదినంబు వేయిపనులఁ దిరుగు
కార్యమగ్నులకు సుకాలంబులకుఁ జాల
దవ్వగాదె ధాత్రిఁ దజ్ఞులార! 60

గీ. రేపటనో మాపటనో తగఁరీతిఁ బయన
మునకు మూర్తంబు జేనికి వినిచిరందు
నాఁగఁ జిత్తమటంచు వా రేఁగి యట్ల
చేసికొనివచ్చి రాసుతుఁ జేరి యనిరి. 61

క. రాతనయ! వినుమ రేపటి
రాతిరి నీపయనమనుచు రాజాజ్ఞయనన్
జేతము సఖుపై మదిరా
జాతపయిన్ బోయి యతఁడు సంతోసమునన్. 62

వ. వారల సబహుమానంబుగ వీడ్కొలిపి పత్రలేఖ రాకున్న
ను నట కేఁగెదనని మనంబునఁ దలంచుచు నప్పవలు
నొక్కరేయియు నెట్లో వెళ్ళఁబుచ్చిన, 63

క. అంత ననురక్తనళినీ
కాంతాసంగమనిరాశఁ గడునడలుచు భా
స్వంతుఁడు దివసముతోడన
యంతర్హితుఁడయ్యె లోక మల్లాడంగన్. 64

గీ. అట్లహర్పతి తూలుడు నపరగగన
భాగ మల్లప్రతీచితోఁబాటు చింత
సాంధ్యరాగచితానలజ్వాలలందుఁ
గ్రుంకె నన నెల్లవారికి గోచరించె. 65

గీ. క్రమత సంధ్యానలస్ఫులింగములమాడ్కి
మిణుకుమిణుకంచుఁ జుక్కలు మింట మెఱసె
దినవిరామమహార్ఘ్యగమంబునను బోలెఁ
దమముచే దిఙ్ముఖములు తంద్రింబు లయ్యె. 66

గీ. చంద్రభగవానుఁ డపుడు నిజప్రకాశ
మునను బ్రాచ్యంగనాముఖంబునకు వన్నె
గూర్చుచుం దూర్పుకొండపై గోచరించి
క్రమముగాఁ జంద్రికాభిషేకం బొనర్చె. 67

గీ. అట్టిచంద్రాభిరామత్రియామయందు
రాసుతుండు ప్రయాణనిర్వహాత సెలవు
గొనఁగ వచ్చినఁ దల్లి యాకొడుకుఁ జూచి
యెట్టో కన్నీటి నణఁచుచు నిట్టు లనియె. 68

ఉ. అంకతలోపలాలితుఁడ వాపసిబాలుని నిన్ను వీడ వం
శాంకుర! తావకప్రథమయానమునం దతిమాత్రమామన

స్సంకట ముప్పతిల్లు టది సాజము తల్లికి నప్పుడే సిటుల్
జంకును గొంకు నామది విచారపయోనిధి ముంచదర్భకా!

గీ. నీదుపయనంబుఁ దలఁచిననాదుహృదయ
మవియునట్టులు ప్రాణంబు లరుగునట్లు
మనసు చెయివెట్టి కలఁచినమాడ్కియు నగు
నేమి కానున్నదో యింక నెఱుఁగఁ బుత్త్రి! 70

గీ. సుతుఁడ! తోఁచెడు సర్వంబు శూన్య మట్లు
యాపినను బాష్పపూరంబు లాగ వాయెఁ
గాయ మంతయు సలసలఁ గ్రాఁగఁజొచ్చె
నెందు కీబాధయో నాకు నెఱుకపడదు. 71

ఉ. చాలదినాలు దిగ్విజయసంభ్రమమందున నుండి మొన్న నే
బాలుఁడు వచ్చె నెట్లిపుడె పంపుదునా యనియో, సుహృ
ద్వియో। గాలసు నొంటి నంపుట యనర్థమటంచునొ, మం
త్రిపుత్త్రిపై। మాలిమినో యిఁకేమిటనొ మానస మెంతయు
సంచలించెడిన్. 72

క. భవదీయప్రస్థానిక
వివిధశుభాకలన కేను వేడ్కపడితిఁగా
ని వనట నవి దీర్పఁగ నా
డవు కాళులు సేతులున్ గటా! యేమందున్. 73

ఆ. సఖుని దోడితేరఁ జనునిన్ను మాన్పంగ
నోరు రాదు రాకుమార! నాకుఁ
బొమ్ము మిత్త్రిఁ దోడితెమ్మని దీవించి
పనుప నంతకంటె మనసురాదు. 74

క. నాయీవ్యథ లన్నియుఁ దల
పోయుచు మదిలోనఁ దొంటిపోలికి జాగున్
జేయక యే చనుదేరఁగ
నాయుష్మంతున కొనర్తు నంజలి తలతోన్. 75

వ. అని యానతిచ్చుతల్లికి నమ్రుఁడై చంద్రాపీడుండు తల్లీ! యిప్పుడు దిగ్విజయప్రసంగంబునఁ దడయవలసె. ఇప్పుడియ్యదియు కర్జంబు గాదె. నేను మాత్ర మంబాదర్శన మొనర్పక నిలువంగలనే. వెనుకటియట్లు జాగొనర్తునను చింత స్వాంతంబున నిడకుమని విన్నవించి తల్లిచే నతికృచ్ఛ్రంబున నున్ముక్తుండై తండ్రిని దర్శించి శయానుం డగు నతనికి దూరంబుననుండియ నమస్కారంబు గావించిన నాతండు కుమారుంజూచి కించిదున్నమితపూర్వకాయుండై శయనగతుం డగుచునే చీరి కౌఁగిలించి బాష్పపర్యాకులాక్షుండై యిట్లనియె. 76

క. ఓవత్స! తండ్రి దోషిగ
భావించెను నన్నటంచు భావమునందున్
దేవలదు గుణాధాన
ప్రావీణ్యపరీక్ష చేయఁబడియెన్ నీకున్. 77

గీ. గుణగణంబుల నితఁడు యోగ్యుండు వీని
వలన లోకంబునకు మేలుకలుగు ననుచుఁ
దెలిసి యామీఁద రాజ్య మీవలయుఁగాని
తనయు నెయ్యంబుచే నీయఁదగదు సుమ్ము. 78

మ. తనయా! రాజ్యమనంగ భూభరముచేతన్ దుర్వహం
బెంతో వ। క్రనయప్రక్రమపాలనంబునను దుర్గం బెంత
యున్ భూమిభృ। ద్ఘనసంబాధముచేతనే యధికసంఘర్షం
బు ప్రోత్తుంగవం। శనిరూఢత్వము చేతనే యొరులకున్
సమ్యగ్దురారోహమున్. 79

క. వినుమా యది కంటకశో
ధనముననే దుర్గ్రహంబు తనుజాత! చతు
ర్వనరాశిపరీతవ్యా
ప్తినె యది యత్యంతవిస్తృతిన్ బాటించున్. 80

క. అవివేకి యవిక్రాంతుం
డవినీతుఁ డసత్యవాది యప్రియవచనుం
డవగుణుఁ డనిర్జితేంద్రియుఁ
డవనీరాజ్యంబునకు ననర్హుఁడు తనయా! 81

గీ. ఎవఁడు నిజసుగుణములచే నేతదీయ
చంచలప్రకృతిని నిరోధించు నతని
యందునే గురుజనులు రాజ్యంబు నుంచి
మొదను జేయిడుకొని హాయి నిదురఁ గాంత్రు. 82

చ. నను నిటుగాఁదలంచె నరనాథుఁడు నాజనకుం డటంచు
లోఁ। గనియకు రాజధర్మములఁ గీర్తనఁజేసితి నేరిమీఁద
నో। యనుపక రాజ్యభారమును యోగ్యుఁడవై సకల
ప్రజానురం। జన మొనరింపు మీవ తనుజాత! గతిం
చెను మాకుఁ గాలముల్. 83

చ. పిసిడితనంబుచేఁ బ్రిజలఁ బీడయొనర్చను సజ్జనావళిన్
గసరను దుర్మదంబుమెయిఁ గామముచేఁ బరలోకముల్
విడన్ । విసుగ గురూత్తముల్ వినుడు వీడ నొకప్పుడు
రాజధర్మమే । దొసఁగును లేక యుందును ధూర్వహాతన్
మహి నేలితిన్ సుతా. 84

సీ. మరగి పెద్దలసేవ మసలితినేగాని
వ్యసనంబులకుఁ జిక్కి మసలలేదు
భవ్యులచరితంబు పాటించితినెగాని
పంచేంద్రియములఁ బాటించలేదు
చేవిల్లు వక్రంబు చేసితినేగాని
చేతంబు వక్రంబు చేయలేదు
అపవాదునకు భయమందితినేగాని
యసువులకై భయమందలేదు
గీ. కోరి వృత్తంబె రక్షించుకొంటిఁ గాని
తనువు నెప్పుడు రక్షించుకొనఁగ లేదు
జనులచే వ్రేలఁ జూపించుకొననిరీతిఁ
గాలమెల్లను జక్కగాఁ గడపుకొంటి. 85

గీ. అనుభవించితి నిండుజవ్వనమునందు
నమరలోకదురాపంబు లౌసుఖములఁ
గొడుకు లేఁడన్న యాయొక్కకొఱఁత కూడ
నీవలనఁ దీఱె నాకేమి కావలయును ? 86

శా. నే, నిన్నున్ బరిణీతునిన్ సలిపి క్షోణీరాజ్యభారంబు ని
న్నూన్నన్ జేసి పురాతనప్రభువరేణ్యుల్ వోవుమార్గంబుగా

వానప్రస్థుఁడనై తపంబొనరుపన్ వాంఛించితిన్ గాని యీ
శానాశం బొనఁగూర్చె నాకు మనవైశంపాయనోద్యో
గము౯. 87

గీ. ఈమనోరథ మొకటె యీడేఱదాయె
సంతపుణ్యంబునకు నోఁచనైతి నేమొ
లేకయుండిన సుగుణరత్నాకరుండు
మంత్రిసుతుఁ డేడ? యీరీతిమాఱు టేడ? 88

క. ఈకోరిక నామనమున
నే కుళ్ళఁగనీక వడిగ నేతెంచి యిటన్
సాకల్య మొనర్పఁగ ని
న్నాకాంక్షింతుఁ గుమార! యరుగుమ యింకన్. 89

వ. అని విడియం బొసంగినఁ బ్రహృష్టుండై చంద్రాపీడుండు శుకనాసమనోరమలచేఁగూడ నట్ల సంభావితుండై యింద్రాయుధం బధిరోహించి నగరంబు వెడలుడు 'యువరాజుగారు సిప్రాతీరంబునఁ దనప్రస్థానికమంగళార్థ ముపకల్పితం బగు పందిలిఁ జేరకయే చనుచున్నాఁడ'ని తెలిసి యచటిపరిజనంబును రాజపుత్రలోకంబును సత్వరంబుగా వెంటఁ బఱవ గవ్యూతిత్రితయమాత్రం బగుమార్గం బేగి యటఁ దృణకాష్ఠజలసమృద్ధం బగునొక్కచో విడిసి వెండియుఁ దెల్లవాఱుకడనె ప్రయాణంబు సాగించి మనంబున నిట్లు వితర్కింపఁదొడంగె. 90

క. ననుఁ గని త్రిప వైశంపా
యనుఁ డవలకుఁ బరుగులిడిన నాతని వెంటన్

జని కౌఁగిటఁ జేరిచి యా
తనిభయమున్ దీర్చి మిత్రితన్ బ్రకటింతున్. 91

గీ. నన్నుఁ గనుఁగొన్నచో మహానంద మొందు
పూతచారిత్రి నట మహాశ్వేతఁ గాంచి
సేన నెల్లఁ దదాశ్రమసీమ నిలిపి
హేమకూటనగంబున కేగువాఁడ. 92

సీ. నారాక నెఱిఁగించునలినాక్షులకుఁ బూర్ణ
పాత్రింబుల నొసంగి పంపుదాని
ఏఁడి ? యెవ్వరు సెప్పి రెంతదవ్వున నుండె ?
నని నన్నుఁగూర్చియే యడుగుదాని
వత్తు నే ననుసిగ్గువలనఁ దమ్మి నెడల్చి
జిలుగుఁ బాలిండ్లపైఁ జేర్చుదాని
విమలమా మణిదర్పణముఁ జూచి చెదరిన
కొమ్ముడిన్ సవరించుకొనెడుదాని
గీ. భూషణస్థానికముల నంబుజబిసముల
వీడి స్వరుచియె తోడవుగా వెలయుదాని
నెదురువచ్చుటఁ బూసెజ్జ వదలుదానిఁ
జిత్రరథపుత్రిఁ గని నేత్రసిద్ధిఁ గాంతు. 93

క. మదలేఖన్ గని పత్రిణమి
ల్లెద సంభావింతుఁ బత్రిలేఖను బ్రశ్నిం
చెదఁ గేయూరకు సేమము
ముదముగ దురఁ గౌఁగిలించి మునుముందరగన్. 94

క. మదిరాసుతకును నాకును
మొదలిటినుండియు వివాహమును బొనరింపన్
మదిఁ దలఁచుమహాశ్వేత యిఁ
కిదె యదననఁ బెండ్లియాడు నే నాసుదతిన్. 95

సీ. ఏకాంతమందు నాయింతిఁ గ్రమమ్ముగా
సెజ్జయు నొడి జొమ్ముఁ జేర్చుకొందు
సిగ్గుచే వెనుకాడు చెలియ దగ్గఱఁ దీసి
మురిపెంపు నెమ్మోము ముద్దుఁగొందు
అమరదుర్లభ మైనయాతన్వియధరామృ
తముఁ గ్రోలి ధన్యతఁ దఱసికొందు
సరసంబు మృదువునౌ సఖమేను గాఁగిట
నదిమి కామానలం బార్చికొందు
గీ. అసుగాత్రితోడి యనుదినబహువార
భుక్తమయ్యు నపునరుక్త మైన
నిరతిశయసుఖంబు నిశ్రేయసాపర
రూప మనుభవమునఁ జూపుకొందు. 96

క. అఱనిముసమేనిఁ గాదం
బరిఁ బాయక యుగము క్షణముభంగిఁ గడుపుచున్
సరసాలాపంబుల నే
ర్పరినై విహరింతుఁ జైత్రరథవాటికలన్. 97

వ. మఱియుఁ గాదంబరీవిస్రంభపాత్రుండనై యెట్టకేలకు దేవి
నభ్యర్థించి వైశంపాయనునకు మదలేఖాసమాగమంబుఁ
జేకూర్తునం చేమేమో దలపోసికొనుచు నాఁకలిదప్పులఁ

కూడ గణింపక రేయింబవళ్ళు పయనించుచుండ సర్ధ
మార్గంబునందే 98

సీ. కాలసర్పంబు మార్గమునకు మరణాంధ
తమసంబు విరహిసంతానమునకుఁ
గఠినరాహుగ్రహగ్రసనంబు శశికి వి
భావరీప్రాప్తి విభావసునకుఁ
బరుషవాగుర కామిహరిణజాలమునకు
నిగడబంధం బధ్వనీనతతికి
మదసమాగమము మన్మథకుంజరమునకుఁ
బొద్దుపుచ్చఁగ లేమి ప్రోషితలకు
గీ. ప్రాణితతికిఁ గాలాయసపంజరోప
రోధ మాశామతంగజయూథమున క
భేద్యలోహార్గళము ప్రాణిభీకరంబు
వానకాలం బెదుర్కొనె వారి నపుడు. 99

ఉ. దారుణవారివాహనినదంబులు టంకృతులై మహాతటి
ద్వారము లల్లెత్రాడులయి వాసవచాపము విల్లునై శరా
సారము గుప్పుచుఁ బదము సాఁగఁగనీ కరికట్టె మార్గముల్
వారిదకాలమే ప్రబలవైరిగ నన్నరనాథసూతికిన్. 100

గీ. అంధకారితముఖు సహస్రాతిసంఖ్య
ఖడ్గసంపాతదురవలోకస్వరూపు
నాశుగమననిరోధి నేత్రావరోధి
వైరి నోర్పింప నేరాచ వానివశము. 101

సీ. మొదట రాచూలికి మూర్ఛల నొప్పిన
నభ్రాళిచే జగం బంధమాయెఁ
దొలుత రాసుతు సురభిళము లూర్పు లనంత
రంబు కాదంబానిలంబు వీచె
మునుముందు రాపట్టి మన మటుపై నెట్లొ
రాయంచగములున్ బరారిసెప్పె
ముందర నరపాలనందనుకన్ను లా
వల వారిదంబులు జలముఁ గురిసె
గీ. ప్రథమ ముత్కలికాసహస్రములతోడ
రాజనందనువిమలాంతరంబు నిండెఁ
బిదప వార్షుకవారివాడుదరనిర్గ
తాంబువుల శైవలిన్యంతరంబు నిండె. 102

క. నరనాథతనూజునకున్
వరుసపుఁ బెనునీటివెల్లువలచేఁ గమలా
కరములతోనే, కాదం
బరికూటమిపైని యాసపాటున్ మునిఁగెన్. 103

గీ. దుస్తరనదీఘురంబులతోడఁ దియ్య
విల్తునాగడములు కడుఁ బెల్లుమీఱెఁ
గడిమిపూతోడ మేనును గంటకించెఁ
గండళంబులతోఁ బాఱె దండ మవిసె. 104

క. రాతనయునకున్ సునిశిత
కైతకసూచులనె గాడెఁ గడు మర్మంబుల్

జ్యోతిర్గ దమ మణఁచెడుతటి
దాతపభరమునసె తాప మతిశయ మాయె. 105

సీ. చదలున జలదఘోషములచే నంతరా
శమునఁ జాతకనినాదములచేత
ధరణి దర్దురరావభరముచే వనుల ను
న్మద కేకికేకాభ్యుదయముచేత
నదుల వీచీనిస్వనమ్ములచేఁ దాళ
తరువుల మర్మరధ్వనులచేత
దెసల ఝంఝానిలతీవ్రారవంబుచే
గిరుల వార్ధణధణత్కృతులచేత
గీ. వికలమానసుఁడౌచు భూవిభుసుతుండు
పవలు రేయియు నూరను బయట దారి
యందు బసయందుఁ జనునప్డు డాఁగునప్డు
డాత్మయం దించుకంతయు హాయిఁ గనఁడు. 106

గీ. జగతి వజ్రానలంబట్లు జలదసమయ
సమిధమై విరహుల భస్మసాత్కరింప
నుద్యమించినకామాగ్ని కోర్వలేక
యతఁడు ధీరాత్ముఁడయ్యు ధైర్యంబు విడిచె. 107

సీ. జడివాన మహినెల్ల జలమున ముంచివే
సినదయ్యు నతని శోషింపఁజేసె
విద్యుదాలోకంబు వెలిఁగించియును దెస
లతని మూర్ఛాతమంబందుఁ దోసె

జలదానిలంబులు సకలప్రజకు సౌఖ్య
మిడియు నాతని నిర్గహించివైచె
అఖిలజీవనహేతువయ్యుఁ బ్రావృట్కాల
మతని జీవితసంశయాత్మ సలిపెఁ
గీ. గాని కాదంబరీసమాగమమహాశ
యొకటి యాతనియసువుల కూఁత యగుట
గమనరోధక మైనయకాలమందు
నెందు విశ్రాంతిఁగొనక యే యేగ నతఁడు. 108

వ. ఇట్లేగి యేగి త్రిభాగావశిష్టం బగుపథంబున మేఘనాదుఁ గనుంగొని పత్త్రిలేఖావృత్తాంత మావల నడుగనగునని దూరంబునుండియు కృతనమస్కారుం డగునాతని వైశం పాయనువార్తఁ బ్రశ్నింపఁదలంచి భద్రా ! అచ్ఛోదసర స్తీరంబున వైశంపాయనుండు గనంబడెనా ? అం దేల యుంటివన నేమనియె? మనల విడనాడినందులకు వగచుచుం డెనే? మనలఁ దలఁచుకొనునా? నన్నుఁగూర్చి యేమేని యడిగెనా? ఆతని భావం బెఱింగితివా? తలిదండ్రుల కేమేని వార్త నంపెనా? రావలసినదని తెలిపితివా? నారాక నె ఱింగించితివా? అటనుండి వెడలఁడుగదా? దర్శనం బొసం గునా? నాతోఁగూడ వెండియు నరుదెంచునా? అట నెట్లు ప్రొద్దుపుచ్చుచున్నాఁడని యడిగిన ' దేవా ! దేవరవారు వైశంపాయనుఁ గనుంగొని యిదే వత్తునని నన్నుఁ గాదం బరికడ నుంచి యేగినదాది నే నేమియు నెఱుంగను. ఏలిన వారు జా గొనరించుటచే జలదకాలంబని తలిదండ్రులచే

నాపఁబడియుందురు. నీ వొకఁడ విం దుండరాదు చనుము. మే మిదే మిమ్ముఁ గలసికొందుమని పత్త్రిలేఖయుఁ గతిపయమిత్త్రులును నన్నుఁ బయనింపఁజేయు నచ్ఛోదంబునకేగక యే యిట కరుదెంచితినని మేఘనాదుఁ డూరకున్న రాకుమారుండు వెండియు భద్రా! యింతప్రొద్దేగినను రా రేమియనిన దేవా! మధ్య నేదేని విఘ్నంబు లేనిచో వారు తప్పక వత్తురనియే తలంతునని మేఘనాదుఁడు విన్నవింపఁ గాదంబరీగతహృదయుం డైనయారాజకుమారునకు,

సీ. కారుమబ్బులు శమనకింకరులువోలెఁ
జటులగర్జలు ప్రేతరాడ్భటహాము లటు
జలదధారయు స్మరశరాసారము వలె
వెఱపుఁ గొల్పిన నెట్లొ జీవితము నిల్పి. 110

క. మేచురవర్షాలక్ష్మ్యు
త్పాదితశోభమయి తోఁచెఁ జందమున నను
త్పాదితలోచనహృదయా
హ్లాద మ్మచ్ఛేద మరసి యతఁ డపు భటులన్. 111

ఉ. మీ రిట నాల్గువైపులను మేల్కొనియుండుఁడు మంత్రి
పుత్త్రుఁ డే। దారిని బోవునో తెఱప యెదన్ జిగురింప
నటంచుఁ దా లతా। గారములన్ శిలాతలులఁ గ్రిమ్మఱుఁ
గ్రిమ్మఱుఁ జూచిచూచి యా। చేసవతావులెల్ల దరిసించి
చెలిన్ గనలేమి ఖిన్నుఁడై. 112

ఉ. ఈలఁపు పత్త్రిలేఖ వచియింప మదాగమనంబు మున్నె యా
భూతలమున్ ద్యజించి యెటకో పోయె ధృవం బటు కాక

యున్నచో। నేతటినీతటంబుననో యేపాదరింటనో యేమ
రానవో। యేతరుమూలమందుననో యీతనియల్కడి కాని
పింపదే. 113

ఆ. బాల్యసఖుని మంత్రిబాలకు విడనాడి
కదల నాకు ముందు కాళ్ళు రావు
కానకున్న నల్లకాదంబరిక జీవి
తమ్ము నిలువ దేమిదారి యిపుడు. 114

క. ఏతదుదంతమ్ము మహా
శ్వేత కెఱుకపడఁగవచ్చుఁ జేరి యటకు నా
పూతచరిత నడిగెద నని
యాతఁడు మితసేనతోడ నచ్చటి కరిగెన్. 115

వ. అట్లరిగి గుహాద్వారంబుననే ధవళశిలాతలంబున నధో
ముఖియై కన్నీరు గార్చుదాని దీనముఖి యగుతరళికచే నవ
లంబితశరీర యగుదాని మహాశ్వేతం గనుంగొని ఏమీ!
యిమ్మహాభాగకుఁ జింతింపఁ గతంబేమి? కాదంబరి కే
మేని యనిష్టంబు కలిగియుండునా? యని శంకించుకొనుచు
నాశిలైకదేశంబుననే యుపవిష్టుండై యేమిది యని తరళిక
నడుగ నాపె మహాశ్వేతముఖం బవలోకింప నాయమ
రాకుమారుం గని రాజనందనా! దుఃఖానర్హుండ వగునీకుఁ
బదేపదే దుఃఖవార్తనే యీమందభాగ్య వినిపింపవలసి
వచ్చెడిని. వినుము. 116

సీ. కేయూరకుఁడు భవదీయమా గమనంబు
వచియింప నెంతయు వనటఁ జెంది

చిత్రరథేప్సితసిద్ధి చేకురదాయె
మదిరామనోరథ మదియుఁ బోయెఁ
గొనసాగదాయె నాకోర్కి చంద్రాపీడు
నకుఁ బ్రియ మేమియొనర్పఁ గొంటిఁ
గాదంబరిని బ్రాణకాంతుతోఁ గలపంగఁ
జాలనైతి నటంచుఁ జాలఁ గుంది

గీ. జాతవైరాగ్యనై తపశ్చరణమునకు
నిచటికే వచ్చి దేవర కెందుఁ దీసి
పోని యాకారసంపత్తిఁ బొలచువాని
నొక్కమొగి నన్ను గనువిప్రయువకుఁ గంటి. 117

గీ. అతఁ డపరిచితుఁడయ్యు నత్యంతపరిచ
యంబు గలవానివలె సమీపంబుఁ జేరి
లోన నెదియో స్మరించెడువానిపగిదిఁ
గనఁబడుచుఁ జాలసేపు నన్ గాంచి యునిచె. 118

గీ. పడఁతి! సడిఁబడఁ డెవఁడేనిఁ బ్రాయమునకొ
జనికొ యాకృతికో సదృశముగ నడచి
నియతవక్రప్రకృతి నైననియతికట్ల
యసదృశాచారమందు నీ కాస్థ యేల? 119

గీ. మాలతీసుమసుకుమారమాలవోలెఁ
గంఠపరిచయయోగ్యమై క్రాలునీదు
తనువు నీదృశదుష్కరతపముచేత
వాడఁజేయుట తగునె? పూఁబోఁడి సెపుమ! 120

క. సుమనోహారిణి లత చం
దము తావకతనువు రూపతారుణ్యసదృ
క్షము సరసము నగుఫలముఁ
రమణీ! ప్రాపింపకున్న రమ్యత గలదే? 121

ఉ. ఓరమణీమణీ! జననమొందినప్రాణి కురూపియైని సాం
సారికసర్వసౌఖ్యములసార మెఱింగి మదిఁ బయిఁ బర
లోకసుఖప్రదం బయినయుత్తమ తత్తప మాచరించి మే
లారయునన్న నింక రుచిరాకృతిమాట వచింప నేటికో?

గీ. సహజసరసత గలసరోజనికిఁ దుహిన
పాతముంబలె నాయాసపఱచు నన్ను
సహజసరసత గలనీప్రశస్తదేహ
వల్లరికి దుష్కరోగ్రతపశ్శ్రమంబు. 123

సీ. నవవిల్లుఁ డస్త్రసన్యాసంబు గావించి
వని నెందొ తలఁ దాఁచికొనఁగవచ్చు
జాబిల్లి చంద్రికాజలజాక్షితోఁ కేల
విహరించుటలు మానివేయవచ్చు
రంతులు మాని వసంతకుమారుండు
వనలక్ష్మి వీడ్కోలువడయవచ్చు
మలయాచలమునుండి మందానిలుఁడు పెంద్లి
నడకలకుఁ స్వస్తి నుడువవచ్చు
గీ. ఇట్లు సౌందర్యరాశినా నెసఁగునిన్ను
బోటిబోటిసుఖములకుఁ జోటునీక

యాదినుండియు వైరాగ్య మాత్మ నూని
కర్కశతపంబుచే మేను కలఁచు నేని. 124

క. ఈవిధిఁ బలుకుచునతని నే
నేవాఁడవు వచ్చినాఁడ వెటనుండి యటం
చేవియుఁ బ్రశ్నింపను మ
ద్భావము శ్రీపుండరీకుపై నెలకొనుటన్. 125

గీ. కాని యటనుండి వేఁబోక కడకుఁ జేరి
కుసుమముల దేవపూజకుఁ గోసికొనుచుఁ
గట్టములయందు నీనన్ను కాచియున్న
ప్రియవయస్యను దరళికఁ బిలిచి యంటి. 126

చ. తరలిక ! వీఁ డెవండొ వసుధాసురనందనుఁడట్లు తోఁచు నీ
తరుణునిచూపు, మాట, పెడదారిగఁ గన్పడు మందలింపు
మీ। పరిసరసీమ నింకెపుడు పాదము పెట్టకయుండునట్లు దౌ।
ష్పరముగ మందలించినను బాయనిచోఁ దగుశాస్త్రియయ్యె
డున్. 127

గీ. నాఁగఁ దరళిక యట్టె వారణంబు సేసెఁ
గాని దుర్వారగమనుఁడౌ కామహతకు
దోసమునఁ గీడు మూఁడెఁగా వ్రాసియుంట
వెడఁగు పూర్వానుబంధంబు వీడఁడాయె. 128

మ. ఇటుకొన్నాళ్ళు గతింప నొక్కనఁడు రేయిన్ జంద్రపాదంబు
లు। త్కటకందర్పశిఖిన్ రగుల్కొలుపు జ్యోత్స్నాపూరముం
జిమ్మ ని। చ్చటనే యొక్కఁడఁ గూర్క నాచెలియు నేసా

ఖ్యంబులన్ గాంచమిన్ । బటుతాపంబు హరింప వాల్చి
మెయి నీపాషాణఖండంబునన్. 129

సీ. కల్హారసౌరభ్యకలితమై యచ్ఛోద
మందమారుతము మైమలయుచుండఁ
కరముల్ సుధాతూలికలుగా దిశాముఖం
బులఁ దెల్లఁజేయుజాబిలిని గనుచు
అమృతమ్ముఁ గురియుస్వీయమయూఖములఁ బుండ
రీకు నీతండు వర్షించునోక్కొ
యనుపరిసంగమున నెమ్మనమున మత్ప్రియ
తముఁ బుండరీకుని దలఁచుకొనుచు

గీ. నాయభాగ్యంబుచేతనే నాఁటిదివ్య
పురుషుమాటయు మృషయయ్యెఁ బొమ్ము బ్రతుకుఁ
గాక యివ్విధినే నీవరాకి యనుచు
ధన్యుఁ డతఁ డిల్లు నన్ను నోదార్చియుండు. 130

గీ. పుండరీకుఁడు మృతుఁడై కొంపోవఁబడియె
దివ్యుచే నాతఁ డెటువచ్చుఁ దిరిగి, వాని
పిఱుఁదనే చనె మునియుఁ గపింజలుండు
కబురునే నంపఁ డేమి నిష్కరుణుఁ డతఁడు. 131

వ. అని యిట్లేమేమో యనుకొనుచు దుర్జీవననై తిఁగదా
యని వగచుచు మేలొక్కనిమె పరుండి. 132

సీ. అడుగడ్డునను గగుర్పొడుపుల నొయి మార
శరశల్యనిచితంబుకరణిఁ గ్రాలఁ

గామాగ్నిచే బూదె గావింపఁబడినట్లు
మొగలిపుప్పొడి మేన సొగసులీన
అరయక పరచిత్త మనుగరా దని గురు
లై యూరువులు గలి కద్దుతవుల
నన్నుఁ బాణిగ్రహణము సేయుకోర్కె స్నా
నము చేసె ననఁగ స్వేదము చెలంగ

గీ. ధీరతఁ గోలుపడి యేగుదెంచువానిఁ
బట్టపగ లట్టిచంద్రాతపమ్ము చేతఁ
దెల్లముగ దవ్వునుండియే తెలియవచ్చు
స్మరవశంవదహృదయు నత్తరుణుఁ గంటి. 133

గీ. పొడిచి వైచెద నెచటికిఁ బోవు దనుచు
మున్ను కొని బిట్టు తర్జించుచున్న దనఁగ
జనితభయకోపచలితమై శ్రవణమందుఁ
గ్రాలునతనికిఁ గేతకీగర్భసూచి. 134

గీ. తిర్య్యవిల్లుఁ డవశ్యమ్మృతికి విధించు
శాసనంబును వలయంబు చొంద మతఁడు
దాలిచెడునో యనంగ మృణాళకుండ
లమ్ము వహియించె నిజభుజాగ్రమ్మునందు. 135

ఉ. దూరమునందునుండియె కుతూహలతన్ ననుఁ గౌఁగిలింపఁగా
బారలు చాఁచికొంచు బహువాంఛితదుర్విషమంబు రాగకూ
పారము నీఁదునట్లు గనుపట్టుచు నూరుపులన్ నిగుడ్చుచున్
జేరెడువాని వానిఁ గని చిత్తము తత్తరమందె రాసుతా !

గీ. దీనుఁ డవివేకి పరభీతి లేనివాఁడు
మదనపీడితుఁ డున్మాది యెదియొ తలఁచి
చేనయిననన్ను ముట్టినయేని యకట
పాయవలెఁగా మయిలసోఁకు కాయ మేను. 137

ఉ. ఎన్నియొకష్టముల్ సయిచి యెన్నఁడొ వెండియుఁ బుండ
రీకునిన్ । గన్నులఁ గాంచుభాగ్య మది గల్గునటన్న దు
రాశఁ జేసి యే । నిన్నిదినాలు ప్రాణముల నెట్లొ భరించుట
లయ్యె వ్యర్థతా । పన్నము లౌనుగాదె యనిపల్కుచు నేఁ
దలపోయుచుండఁగన్. 138

వ. ఆధూర్తుండు నన్ను సమీపించిన. 139

సీ. చంద్రాననా! పుష్పసాయకుతోఁ గూడి
వేధించుచున్నాఁడు విధుఁడు నన్ను
మత్తకాశిని! త్వదాయత్తజీవనుఁ బ్రీతి
కారాక్షముని నన్నుఁ గావఁజనదె
జవ్వని! తబసులపువ్వుఁబోఁడుల కేని
శరణార్థిఁ గాచుటే పరమసుధర్మ
సుదతి! నన్ గ్రిఁగంటఁ జూడవేని సుమాస్త్ర
పద్మవైరుల కేను బలిన యగుదు
గీ. ననుచు నేమేమొ ప్రలపించునతనినుడులఁ
గలఁగి బాష్పస్ఫులింగంబు లొలుకుచూపు
చేతఁ దర్జించుచున్ రోషశిఖల నిర్ద
హించుచున్ రూక్షవాక్కుల నిట్టు లంటి. 140

ఉ. ఓకలుషాత్మ ! యిట్లు నను నూరక పల్కెడునీశిరంబుపై
నాకులిశం బదేల పడదయ్యెను నాలుక వేయిచీలికల్
గాకయ నిల్చె నేల? పలుగాకి! యయోగ్యతఁ జేసి యేల నీ
వాకది స్తబ్ధతం గనదు ? వర్ణము లేల నశింప వక్కటా!

ఉ. అక్కట ! లేవు నీయెడ శుభాశుభసాక్షులు పంచభూత
ముల్ । ముక్కిడి! యున్న నిట్టినిను ముంచదె నీరము గాలి
తూల్పదే । పొక్కఁగఁ జేయదే యనలము౯, బలిసద్మముఁ
జేర్చు భూమియు౯ । సుక్కఁగఁ జేయదే, నభము శూన్య
మొనర్పకయున్న పాతకీ ! 142

గీ. పంచభూతాత్మకంబౌ ప్రపంచమందు
నిట్టిఁడవు కట్ట ! నీ వేల పుట్టినావు
అరయ వేమియు స్వేచ్ఛావిహారి వయ్యె !
జనుఁడ ! తిర్యక్కులమున నేఁ బొడమరాదె. 143

మ. శుకముంబోలె ముఖానురాగి విది యేఁజో టిద్ది గాదం
చెలుం । గకయే కూయును పక్షపాతగతి౯ం గాన్పింతు
ని న్నీదృశు౯ । శుకజాతి౯ బడవేయఁ డాకువిధి యచ్చో
నున్న నేకాంతహా । సకవృత్తి౯ బచరించి యిట్లనినదోసం
బొండు లేకుండెఁను౯. 144

గీ. నీమురాలాపములు నన్ను నిగ్రహింపఁ
జేసె నొకసంవిభాగంబు చేయుదానఁ
దావకవచోనురూపమౌ తనువుఁ దాల్చి
మంద ! మముబోంట్లఁ గామింపకుండుగాక. 145

వ. అని చంద్రాభిముఖుఁడై యంజలిఘటించి సకలభువన
చూడామణీ! చంద్రభగవానుఁడా! ఏఁబుండరీకు దర్శిం
చినది మొదల లన్యపురుషు మనంబున నేనిఁ దలంపనిచో నీ
నాసత్యవచనంబుచే నీయలీకకాముకుండు మదుక్తజాతి
యందు జనించెడుఁగాత మనుడు నాజడుండును. 146

గీ. అంగసంభవతాపజ్వరాతిశయమొ
యాత్మసంపాదితైనఃఫలానుభవమొ
నాదుశాపమహత్త్వమో యేదొ యెఱుఁగ
మొదలు నఱికినతరువునాఁ బుడమిఁ బడియె. 147

వ. అంత నుత్క్రాంతజీవుం డగునాతనిఁ గనుంగొని విలపించు
తత్పరివారజనంబువలన నాతండు మహాభాగునిమిత్రుండు
గా వింటినని లజ్జావనతవదనయై దుర్వారయై దొరఁగు కన్నీ
టివెల్లువచేఁ బుడమిఁ దడుపుచు మహాశ్వేత యట్టియుండఁ
జంద్రాపీడుండు సర్వ మాలించి కొంత యోజించి కన్ను
మూసి యెలుంగు డీలువడ. 148

గీ. భగవతి! భవత్ప్రియత్వ మపారమయ్యె
నల్పభాగ్యుఁడ నగునాకు నబ్బదాయె
నల్ల కాదంబరీదేవియంఘ్రిసేవ
నాకది ఘటింపు మాఱుజన్మమున కేని. 149

వ. అనిపలుకుచుఁ గాదంబరీసమాగమాభావదుఃఖంబుచేతనే
భేదోన్ముఖం బగుస్వభావసరళం బయినహృదయంబు భేదా
భిముఖం బగుముకుళంబు శిలీముఖాఘాతంబునం బోలె మిత్ర
మరణవార్తాశ్రవణంబున స్ఫుటితంబుకా నోరగిలఁబడినఁ

దరళిక చంద్రాపీడునొద్ద కతిత్వరితగతిఁ జని తదీయమూర్తి
నుపలక్షించి విషణ్ణయై మహాశ్వేతం గని. 150

సీ. భర్తృదారిక! యేల పాడుసిగ్గింకను
యువరాజుదెసఁ జూడు మొక్కమాఱు
ఇక్కుమారునిరూప మీక్షించుకొలఁదియుఁ
గొండొకరీతిగా గోచరించు
ఎంతకదల్చిన నుంతయుఁ గదలండు
మెడపైన తల నిలఁబడకయుండెఁ
గనుఱెప్ప విఱచి చూచినఁ బాప కానరా
దూపిరి యున్నట్లు తోఁప దాత్మ
ఆ. అయ్యొ! రాజపుత్త్రి! యయ్యొ కాదంబరీ
ప్రాణనాథ! యెట్టిపాటుఁ గంటి
ఈవు లేక యెచటికే మేగెదము తండ్రి!
యనుచు ముక్తకంఠ యగుచు నేడ్చె. 151

క. అది విని గంధర్వాత్మజ
యదరిపడి నృపాలసూను నట్టే గనుచున్
మదిలో మది లేక మహా
వదచే నిశ్చేష్టయయ్యెఁ బ్రతిమయొ నాఁగన్. 152

వ. అప్పుడక్కోలాహలం బాలించి తదీయపరిజనంబు పట్టరాని
తమకంబుతో నిట్లు విలపించిరి. 153

సీ. దుష్టతాపసి! యెంతదుండగం బొనరింపఁ
జాలితి పాపాత్మురాల! నీవు

గుణరత్ననిధి నర్థిగణకామధేనువు
ననఘుఁ జంద్రాపీడు నణఁచినావె
ఛీ వరాకీ! యెంత చేటువాటిల్లె నీ
వలనఁ దారాపీడవంశమునకు
ఎవనిమోమీక్షించు నిఁక లక్ష్మి యెవ్వాఁడు
భూమి కాలంబనభూతుఁ డింకఁ
గీ. గొలుతు రెవ్వని నిఁక సేవకులు ధరిత్రి
నక్కటా దిక్కులేనివా రైరి జనులు
ఎల్లవారల నిటు దురపిల్లఁజేయఁ
బుట్టితివొకో మహాశ్వేత! భూతమట్లు. 154

మ. సమసెన్గా మఱి నేఁటితోఁ బరిజనశ్లాఘల్ ప్రియాలాపన
క్రమ మస్తంగతమయ్యె భృత్యులకు సత్కారంబులున్
దగ్గె శీ।ల మనాథం బయిపోయె సజ్జనుల కుల్లాసంబు మా
సెన్ నిశా। రమణాకార! కుమార! నీవిటు శరీరంబున్
విసర్జించుటన్. 155

శా. మాపట్లన్ గరుణించి ప్రాణములఁ గొన్నాస్త వెండి మీ
తండ్రి తా। రాపీడావనిభర్త దాల్చినమహీరాజ్యంబు దా
ల్పంగఁ జం। ద్రాపీడా! యెరుఁ డష్టాఁడే హృదయభేదం
బాప్పనే కుందుచే। భూపాలాంగ్రిణి! కాతరప్రకృతికిన్
బోలెన్ నృపుల్ మెత్తురే. 156

సీ. సుతవత్సలుండు విశ్రుతుఁడు తారాపీడ
విభుఁ డిది విన్న జీవింపఁగలఁడె

కడుపారఁగా నిన్నుఁ గన్నతల్లి విలాస
వతి యిది విని మేను వాయకున్న
గతపుత్త్రుఁడును భవత్కల్యాణకాంక్షియు
శుకనాసుఁ డిది విని సొమ్మసిలఁడె!
కన్నసంతానమ్ముకరణి నీ కనుమనో
రమ యిది విన్న నారాటపడదె
గీ. మహీపతులు నిన్ను విడి యెట్లు మనఁగలారు
ప్రజలు నినుఁ బాసి యేరీతి బ్రతుకఁగలరు
ఏకపదమున నిందఱ నిట్లు విడిచి
చనితి వీనిష్ఠురత్వ మెచ్చటిది నీకు. 157

గీ. గురుజనంబులపట్ల నీకుం గలట్టి
నమ్రభావంబు భక్తి యనంతముగద
వారియనుమతి లేక యే దూరతరము
నాక మేకాకిగాఁ బోయినావె తండ్రి! 158

వ. ఏతద్విలాప మాలించి నృపాలలోకం బే మియాయత్యాహితం బని యుద్భ్రాంతస్వాంతమై యట కేగుదేర నింద్రాయుధంబు దీనంబుగా రాజసూనుఁ గనుంగొనుచు హేషారవప్రకటితాక్రందమై దుఃఖంబుచేతనుంబలె ఖురపుటంబుల భూతలంబు నుత్పాటించుచుఁ దురంగమత్వంబు వీడఁదలంచుచుండ నటఁ గాదంబరీమహాదేవియుఁ బత్రలేఖానివేదితచంద్రాపీడాగమనయై చంద్రోదయోల్లాసిని యగుమహోదధివేలయుంబలె సముకగత్వజమై తద్దర్శనోత్సాహంబుతో

‘ మహాశ్వేతం జూడఁబోయెద ’ నని తల్లిదండ్రులయొద్ద
సెలవుగొని. 159

సీ. తనుకాంతికిన్ దృష్టిదాఁకకుండఁగఁ జుట్టు
జిలుఁగుదువ్వలువ మైఁ జెలువమీన
మేనఁ దాల్చినపరిసూనమాలికలు మి
ళిందబృందములకు విందొనర్ప
ఘలుఘల్లుమనుచు నందెలు దమ్ములట్టిపా
దమ్ముల కొక్కయందమ్ముఁ గూర్పఁ
గాంచనకింకిణీక్వణితసన్మేఖల
పేదనెన్నడుమున బిగువొసంగఁ

గీ. దమకుఁ గేయూరకుఁడు ముందుదారిఁ జూపఁ
గొంద ఱిందీవరాక్షులు గొలువఁ బత్ర
లేఖ కేల్గొని సఖి మదలేఖఁ గూడి
వచ్చెఁ గాదంబరీదేవి వైభవముగ. 160

వ. ఇవ్విధంబున మహాశ్వేతాశ్రమంబున కరుదెంచుచు నగ్గం
ధర్వరాజపుత్రి తమకంబుతోఁ జెలియ నుపలక్షించి. 161

మ. మదవస్థం గని నాకు నూఱటగ నీమాటల్ ప్రసంగించెనో
మదలేఖా! మనపత్రలేఖ యను నిమ్మాడ్కిన్ మదిన్ నమ్మన
య్యెద నారాజకుమారుఁ డిచ్చటికిఁ దానేతెంచు నన్ వార్తని
ర్దయచిత్తుం డతినిష్ఠురాత్ముఁ డగు నాతం డేల యేతెంచెడున్

గీ. నాఁడు హిమగృహమందున నాయవస్థ
లరసి యశ్రద్ధధానుఁడై యతఁడు వలుకు

వకి ్రభాషితముల కెల్ల సక్రమముగ
నీవగా యుత్తరం బిచ్చినావు తలఁతె? 163

గీ. నమ్మఁజాలండు నేమరణమ్ముఁ గన్న
దుర్విదగ్ధుం డతండు నాదు దురవస్థ
నాకొఱకె యింతదుఃఖ మీనాతి గనెడు
నని తలంచిన నపు డింటి కరుగఁ డట్లు. 164

ఉ. రాఁడని యే తలంచెదను రాసుతుఁ డెట్టులొ వచ్చునేనిఁ
బూఁ। బోఁడిరో వాని నీవె తగుపోలిక మన్ననఁ జూతు
గాక నేఁ। జూడను మాటలాడ శిరసుఙ బదముఙ ఘటి
యించి మొ్రక్కినఙ।గూడ గ్రహింపఁ బ్రార్థనముఁ గోమ
లి నీవపు డూరకుండుమీ. 165

క. అని యివ్విధిఁ గాదంబరి
తనచెలితోఁ బలుకుచుఙ బథశ్రమ మింతేఁ
గనకయె యువ్విళ్ళూరుచు
జననాథకుమారుఁ గాంచఁ జను దెంచి యటఙ. 166

సీ. అమృత మూడిచినరత్నాకరంబట్లస్త
మితతారకం బగుమిన్నువోలె
ననలు దుల్చినపుష్పవనమటు కైరవ
బంధుహీననిశాప్రబంధమువలె
మూలవిచ్ఛేదిమృణాళంబుపగిది ను
త్ఖాతకర్ణిక మైనకమలమట్లు
నాయకమణివిహీనము హారముంబలె
రసము లేనిపి ్రబంధరాజమట్లు

ఆ. జీవితంబు లేని క్షితిపాలసుతుఁ జూచి
హా! యిదేమటంచు నవని కొరగు
చిత్రరథకుమారిఁ జెలి మదలేఖ వి
భ్రాంతచిత్త యగుచుఁ బట్టుకొనియె. 167

వ. అప్పుడు పత్రలేఖయుఁ గాదంబరీకరంబు విడిపించుకొని చింతాభరంబున నచేతనయై నేలఁబడియె నంతఁ గొంత సేపటికి మదిరానందన లబ్ధచేతనయయ్యు మూర్ఛితయుం బలె నిశ్చేష్టయై యూర్పులనేసి విడువక చంద్రాపీడువదనంబునే కనుంగొనుచు స్త్రీవిరుద్ధం బగుచిత్తంబుతో నున్న నాలోకించి యార్తనాదయై యడుగులంబడి మదలేఖ

గీ. ప్రియసఖ! ప్రసన్న వగుమ నాపయిన మన్యు
భార మిటు దిగఁద్రావిన బ్రతుకఁగలవె
యశ్రుమోచనమున దాని నవల కనుపు
మమ్మ! లేకున్న నీహృదయమ్ము వగులు. 169

క. సుదతీమణిరో! నీతో
డిదె జగమని ప్రొద్దుపుచ్చెడినిజపితరులఁ
మదిరాచిత్రరథుల నె
మ్మదిలోఁ దలపోయువారిమను టే మగునో. 170

వ. నీవు లేక యక్కులద్వయంబు నిలువనేరదు. గురుజనరక్షణం బవశ్యకర్తవ్యం బనుచు మదిరాపుత్రి చిఱునవ్వు నవ్వి యిట్లనియె. 171

సీ. వెఱ్ఱిదానా! యేల విభ్రాంతి వఱ్రిని
భంబు నాహృదయంబు పగులు టెట్లు

ఈఘోరదృశ్యంబు నీక్షించి వేయివ్ర
క్కలు గాకయే యుద్ది నిలిచె మఱియు
బ్రతుకాస గలిగినకడఁటికిఁగా తల్లి
తండ్రియుఁ జుట్టాలుఁ దక్కువారు
మ్రియమాణ కబ్బెను బ్రియశరీరము దీని
ననుమరణంబుచే నాదరింతు
గీ. నాకొఱకు వచ్చి యిట్లు ప్రాణము లొసంగు
రాకుమారునివలన గౌరవము గన్న
మత్తనువు నశుచిసంపాతమాత్రమున నె
చులకనగఁ జేసికొనునంత శూన్యమతినె? 172

శా. నాకద్వారము చేరఁబోయెడుఁగదా నానాథుఁ డిప్పట్టు
నన్ । శోకంబూని యమంగళంబున కెటుల్ చోటిత్తుఁ బ్రాణే
శుఁ డే। లోకంబేగునో వానివెంట నటకీలోఁబోవ నుంకించు
నా । కీకాలం బతిహర్ష భాజనముకాదే యెట్లు శోకించెదన్.

ఉ. ఎవ్వనికోస మే గురులనేనిఁ దలంపనో లోకవాదుచే
రవ్వయు నొవ్వనో కడుభరంపడఁ జేసితినో వయస్యులన్
దవ్వుగ నుజ్జగించితినొ తత్త్రిప ధర్మము వంశగౌరవం
బవ్వలఁ ద్రోచిపుచ్చితినొ యట్టిఁడుగా యితఁ డంబుజాననా!

ఉ. ఈతనిఁ జూచియోగద యహీనకుఁ బ్రాణవయస్యకున్ మహా
శ్వేతకునై యటుల్ ప్రతినఁ జేసియుఁ దీర్పక యుంటినంచు నేఁ
జేతమునందు నేఁ దలఁప ఛీ యిఁక నీదృశుఁ డాప్రియుండు
నా । కై తనువుం ద్యజింప నెటు కాయము వాయకయుందు
నచ్చెలీ ! 175

క. నరనాథసుతుఁడు తనకై
దొరఁగఁ దనువు నీవె బ్రతుకదొరకొనె ననకే
మరణమె జీవిత మగు ని
త్తరుణంబున నాకు జీవితమె మరణ మగున్. 176

ఉ. ఉల్లమునందు నాపయి మహోత్కటమా ననురాగమేని నో
పల్లవపాణి! తీర్పు మొక ప్రార్థన యగ్నిపథంబుగా నిటుల్
వల్లభుతోడ నేను త్రిదివంబునకున్ జన నాదుచింతచేఁ
దల్లియుఁ దండ్రియున్ మృతికిఁ దార్కొనకుండఁగఁ జూచు
చుండుమా. 177

గీ. చెలియ ! నాపయి నున్న వాంఛితము వారు
నీయెడన్ దీర్చుకొనునట్లు నీ వొనర్పు
స్వర్గతకు నాకునున్ జలాంజలి యొసంగు
పుత్త్రిరత్నంబు నీయందె పుట్టుఁగాత. 178

వ. మఱియు. 179

సీ. నాదుముంగిట నున్న నాపట్టి యగుమావి
గున్నకు మాధవిన్ గూర్పఁదగును
నాపదంబుల మన్ననన్ గన్నకంకేళి
చిగు రలంకృతి కేనిఁ జిదుమరాదు
మమత నేఁ బెంచినమాలతిన్ బూవు లూఁ
కొని దేవపూజకే కోయవలయు
నాభవనమున శిరోభాగమున నున్న
కామదేవపటంబుఁ గాల్పఁజనును

గీ. పుత్త్రికృతకంబు నామృగపోతకంబు
మంచిరూశ్రిమమునకు నర్పించవలయు
బోఁటి ! నేఁ దాల్చునవరత్నభూషణముల
నెవరికేఁ బాత్రు లగువారి కీయఁదగును. 180

మ. హరిణాక్షీ! పరిహాసనామమున నొప్పాఁజిల్కఁ గాళిందియ
న్గారువంకన్ విడిపింపఁగావలయుఁ జిక్కుల్ సెందకుండంగఁ
బంజరబంధంబుననుండి, యేరివలనన్ జాకుండ నిల్పుండు మ
త్కరసంపోషితతచ్చకోరయుగ ముద్యత్ప్రీతిఁ గేళీగిరిన్.

క. కాళుల వెంబడి వచ్చుచు
రాళంబుల్ మత్సరోవరనివాసంబుల్
గూళల చేఁ బడకుండఁగ
నాళీ ! యొప్పగిది దాని నరసెదవో కదా ! 182

క. ఎంతో బలవంతముగాఁ
గాంతారమునుండి క్రొత్తగాఁ దేఁబడె సా
ధ్వాంతరవాసము నొల్లక
చింతిలునవ్విపినమానుషిని విడుఁ డటనే. 183

గీ. చాన ! నా కేళినగముఁ బ్రశాంతుఁ డైన
యొక్కతాపసపుత్త్రున కొప్పగింపు
ఇంపుమీఱఁగ నేను వాయించువీణె
నీవ నాజ్ఞప్తికై కొను పూవుఁబోఁడి ! 184

వ. నాసఖీజనంబు నకొండెఁ బరిజనంబునకొండె నాలేనికొఱంత
నీవ దీర్పఁదగుదు. నానాఁటినరసాలసాలంబుల ఫలోదయ
పర్యంత మీవ గావవలయు. మదనన్య వగునీకు వేఱచెప్ప

నేల ? మత్సర్వస్వంబు భవదభీష్టం బెట్లు యట్లు గావింప
వలయు. నేనో. 185

సీ. శీతలామృతకరసారితంబుచేత నా
శ్యానచందనచారుచర్చచేత
ధారానికేతనాసారవారముచేతఁ
గమలదళాస్తరణములచేత
హిమశశికరతారకితహారములచేత
రమణీయమణిదర్పణములచేతఁ
బ్రవిమలకిసలయప్రస్తరంబులచేత
నళినకైరవశయనములచేత
గీ. దగ్ధశేషంబు మామకతనువుఁ బ్రియుని
తతచితానలమందు నాహుతియొనర్చి
రాకుమారుని జన్మాంతరమున నేనిఁ
బొందుమార్గంబుఁ గావించుకొందుఁగాక. 186

వ. అని వచించుచునే లేచి తన్నువరోధించుమదలేఖ నెట్టకేని
వదలించుకొనియుఁ దనకన్న మున్న మే నుజ్జగింపఁజూచు
సఖిని వారించియుఁ బ్రియవయస్యయగు మహాశ్వేతం
దఱిసి కౌఁగిలించుకొని నిర్వికారవదనయై. 187

మ. చెలి! నీ కింతయె యంతో యాస యలరున్ జెల్వొందు
జీవింపఁగాఁ । గలఁడంచున్ నిధనాధికంబుల మహాకష్టంబు
లన్ సైచి యె । ట్టులో జీవించెదు దాన నీచెనఁటి కట్టుల్
గూడ లేదాయె వే । నెలవిమ్మా మరుపుట్టునన్ మన కిటే
చేకూరుతన్ నెయ్యముల్. 188

వ. అని మహాశ్వేత నామంత్రించి. 189

మ. పులకల్ కేసరపుంజముంబలె మెయిన్ బొల్పొంద బాష్పాం
బువీచులు భీవాతహతంబులై తరళతన్ జూపట్ట నైఁజెమ్మ
టల్ జళమై యవ్విరిఁదేనెఁబోలఁ జనఁ జంద్రాపీడచంద్రుండువి
హ్వలయౌ యత్త్రావతీనెమాడ్కిఁ గనుఁగల్వల్ మోడ్చె
యయ్యింతియున్. 190

క. హృదయేశుఁ దదవస్థుఁ
గదిసి సమాగమసుఖంబుఁ గనుచున్ గబరిన్
బొదలెడుపూవులు జలజలఁ
బదముల రాలంగఁ బతికిఁ బ్రణమిల్లి తలన్. 191

గీ. తత్పదంబుల స్వేదామృతపరిసిక్త
కరములన్ గొని భక్తి నంకమ్ముఁ జేర్పఁ
దత్కరస్పర్శనమున నందఱును జూడ
నిందుసుందర మగుజ్యోతియొండు వెడలె. 192

వ. అంత నమృతవర్షిణియోయన నాకసమునుండి, "వత్సా! మహాశ్వేతా! వెండియు నిన్ను నేనే యోదార్పవలసె. నీ పుండరీకుశరీరంబు నా తేజస్సుచే నాప్యాయమానమై మల్లోకంబునన భవత్సమాగమాభిలాషియై భద్రంబుగా నున్నది. ఈచంద్రాపీడశరీరంబును మత్తేజోమయంబనియ యెఱుంగుము. ఇది స్వయమ్ముగనే యనశ్వరమ్మయ్యుఁ గాదంబరీకరస్పర్శంబుచే నాప్యాయమానమై పరకాయప్రవేశి యగుయోగికాయంబుంబలె నిరపాయంబైయుండు భవద్విశ్వాసంబునకై యిది శాపాంతమువఱ కింద యుంచఁ

బడు. దీని నగ్నిం గాల్పక నీటం ద్రోయక పాఱవేయక జాగరూకలరై పునస్సమాగమప్రాప్తియగుదనుక రక్షిం పుఁ" డని యొకదివ్యవాణి వినఁబడుడు నెల్లరు విస్మితులైరి. అంత నవ్వెలుంగు పత్రలేఖపైఁ బ్రసరింపుడు నయ్యంతి సుప్తోత్థితయుంబోలె లేచి త్వరితగతియై పరివర్ధకహస్తంబు నుండి యింద్రాయుధంబుఁ దిగిచికొని. 193

గీ. ఓహా మహోత్తమ! మే మెటు లున్న నొక్క
దూర మేకాకిగా రాట్కుమారుఁ డేగఁ
దగునె యిందుండ నీ కని దానితోడ
నరిగి యచ్ఛోదకాసారమందుఁ బడియె. 194

ఉ. జూలె నిజోత్తమాంగమున శోభ ఘటించుజటాకలాపమై
గ్రాల, సువర్ణసూత్రపరికల్పితమాఖలినంబె జందెమై
వ్రేలఁగ మేన జీనె కటివిస్తృతకల్పకవల్కలంబయై
శ్రీ లెసఁగన్ హయుంబు మునిశేఖరుఁడై చనుదెంచి యి
ట్లనున్. 195

గీ. హంసపుత్రి! పృథగ్జన్మ మనుభవించి
వచ్చిన న్నాత్మ గుర్తింతువా యటన్న
అమ్మహాశ్వేత పరికించి యతని శోక
హర్షములకు నడుమనుండి యనియె నిట్లు. 196

సీ. అన్న! కపింజలా! యెన్నినాళ్ళకు నీవు
కనిపించినావు కాకన్నుఁగవకు
ఏ నెంతటివివేకహీననో సుగుణాల
వాలు నిన్ గుఱుతింపఁ జాలనైతి

నాక మేగినఁ బుండరీకుండు బ్రీతి కెడు
నాకెట్లు లుండు వివేక మకట!
అనఘ ! నీచెలికానిఁ గొనిపోయిన దేవండో
యట్లేల చేసెనో యాతఁ డిప్డు

గీ. డెచట నున్నాఁడో ? నీవృత్త మేమొ, మిత్రు
వీడి నీ వొంటి వచ్చినజాడ యేమొ
ఈవు కబురైనఁ బంపని హేతు వేదొ
తెల్లముగ నన్నియును మాకుఁ దెలుపుమయ్య.

గీ. అనుడుఁ గాదంబరీపరిజనము రాజ
పుత్రిలోకంబు నాశ్చర్యపూర్ణ మగుచు
నొక్కరొక్కరిపైఁ బడు చూఱక గన
హంససుతకుఁ గపింజలుం డనియె నిట్లు. 198

చ. తడుపుచు నట్టు లశ్రుజలధారల ధారుణిఁ బుండరీకుఁడై
యడలెడునిన్ను నయ్యడవియంద త్యజించి సుహృత్త్వ
మెన్నుచున్! నడుమును బిగ్గఁగట్టుకొని నాచెలిఁ దోడ్కొని
యెందుఁ బోయెదో! చెడుగ! యటంచు నప్పురుషుఁ జీరుచు
నాతని వెంటనంటితిన్. 199

సీ. వ్యోమయానంబుల నొప్పి నిర్జరవరు
లాశ్చర్యదృష్టిఁ ద న్నరయుచుండ
అవగుంఠితాస్యలై ధవులచెంగటి కేగు
దివిజాభిసారికల్ తె న్నొసంగఁ
దమకెల్లరకుఁగూర్చుదయితుఁ డం చిటునటు
తారకల్ భక్తి జోహారు లొసఁగ

గగనతలం బనుకాసారమున ఫుల్ల
కైరవాభములఁ జుక్కల గమించి
ఆ. చంద్రికాభిరామసర్వలోకం బగు
చంద్రలోక మరిగి యందు నిందు
కాంతతల్పమందు ఘనమహోదయసభ
నాశరీర ముంచి యనిరె నిట్లు. 200

ఉ. ఓయికపింజలా! హిమమయూఖుఁడ నేను జగత్ప్రవృత్తికై
రేయిఁ జరింతు నీచెలి భరింపఁగలేక వియోగమున్ మెయిన్
బాయుచుఁ జంద్ర! కాల్తువె గభస్తుల, నావలె నీవుఁ గాయ
మున్। బాయుము జన్మజన్మమునఁ బ్రార్థితయాసతిఁ గూడకే
యనెన్. 201

గీ. ఏమి యీయవివేకి న న్నిట్టులనియె
నాత్మదోషంబు నెఱుఁగకం చలిగి నేను
నిట్టు ప్రతిశాప మిచ్చితిఁ బుట్టు మీవు
దుల్యసుఖదుఃఖుఁడవయి నాతోడ ననుచు. 202

చ. అవహితమానసుండనయి యాపయి హంససుతామతల్లి
యా।యువకునిపై మరుల్గొనుటయున్ వనజాక్షియు మత్త్య
రోద్భవం। బవు దివిజాంగనాకులమునం దుదయించినయట్టి
యప్సరో।యువతికి గౌరికిన్ సుతగ నొప్పుటయున్ దలపోసి
కుందితిన్. 203

వ. కాని మిత్రతండు స్వయంకృతాపరాధంబున మర్త్యలోకం
బున రెండుమాఱులేని నాతోఁబాటు పుట్టవలయును.
లేనిచో 'జన్మజన్మమున' నన్నద్విరుక్తి చరితార్థంబు కానే

రద. కావున నీతండు శాపవిముక్తుఁ డగుదనుక నాత్మవిర హితం బగు నేతచ్ఛరీరంబు భద్రిం బొనర్ప నే నిటకుఁ గొనివచ్చితిని. వత్సను మహాశ్వేత నూఱడించితిని. ఇదిగో పుండరీకుని శరీరంబు. నాతేజంబుచే నాప్యాయమానంబ గుచు నాశాపాంత మిట నుండును. నీ పీయుదంతమ్ము శ్వేతకేతువున కెఱింగింపుము. అయ్యనఘుం డే దేనిఁ బ్రతి క్రియఁ జేసినఁ జేయఁగలవాఁడు-అని నాకు సెలవొసంగిన నేనును బ్రియవిరహాంధుండనై వడివడిగా నేతెంచుచు నొక్కవైమానికు నుల్లంఘించిన నాతండు మండిపడి 'ఓయి మిథ్యాతపోబలగర్వితా! అతివిస్తీర్ణమై గగనమార్గంబుండ వేఱొక్కదారిం బోక తురంగంబుంబోలె నన్నతిక్రమించి తివిగానఁ దురంగమవై మహీతలిం బుట్టు' మని శపించినఁ గంపితుండనై ప్రణామపూర్వకంబుగాఁ గలతెఱంగెఱింగించి శాపంబుఁ గ్రమ్మరింపఁ బ్రార్థింప నాతం డన్యథాకరింప నేరక తురంగంబవై నీ వెవనికి వాహనం బవుదువో యాతని యవసానంబున స్నానం బొనరించి విగతశాపుండ వగుదు వన్నఁ గృతాంజలినై మహాత్మా! అట్లేని శాపదోషం బున భూలోకంబునఁ జంద్రునితోఁ బాటు పుట్టు మత్ప్రియ వయస్యునితో నవినాభావం బగు స్నేహం బనుగ్రహింప వే యన్న నాతండు ధ్యానస్తిమితనేత్రుండై కొంతతడ వుండి నన్నుం గని 'ఓయీ నీ నెయ్యంబునకు నాయుల్లంబు పల్ల వించె. ఉజ్జయినీనాథుం డగు తారాపీడునకుఁ జంద్రుఁడును దన్మంత్రిమణి యగుశుకనాసునకు నీ చెలి కాఁడును బుత్త్రిల

య్యెదరు. ఆరాకుమారునకు నీవు వారువంబవై నీయభీ
ష్టంబుఁ బడయు'మనుడు నేనుఁ దత్క్షణంబ యధఃస్థితం బగు
నంబుధిలోఁ బడి యశ్వంబ నైతిని. తురంగమజన్మంబునను
నాకు స్మృతి యట్ల యుండుకతననే కిన్నరమిథునానుసారినై
చంద్రాపీడు నిటకుఁ దోడితెచ్చితి నీశాపదగ్ధుం డేసుమా
పుండరీకుండని కపింజలుండు సవిస్తరంబుగా విన్నవింప ఖిన్న
హృదయయై మహాశ్వేత. 204

సీ. హా! పుండరీకదేవా! యట్లు నాపయిఁ
బూర్వరాగము వెలిఁబుచ్చినావె
అయ్యొ లోకాంతరమం దున్నఁ గూడ నీ
యసువుల కేను రాక్షసిన యైతి
విధి నన్ను సృజియించి యధికాయు వొసఁగుట
పలుమాఱు నినుఁజంపుపనికో యేమొ
చేసేత నిను విగతాసుఁ జేసితి నేన
మెవరినో యన్న నిం కేమిఫలము

ఆ. ఎవరి శరణుఁజొత్తు నెవ్వార లిఁక దిక్కు
దేవ! పుండరీక! నీవగాక
దీనురాలిపైనఁ బూనరాదె కృప
కఠినచిత్త మెట్లు కలిగె నీకు. 205

క. కలిగెను గాఁబోలు గుణో
జ్జ్వల! నీకెద నీయభాగ్యపై వైరాగ్యం
బలఘుఁడ! యటు గాకుండినఁ
బలవించుచునున్న నిట్లు పలుక వదేలా. 206

వ. అని దుఃఖాతిరేకంబున నేలపైఁబడినఁ గపింజలుం డమ్మానిని నూరడించుచు నిట్లనియె. 207

ఉ. ఊరక యేల దుఃఖపడె దోమదిరేక్షణ! దూరుకొంచు నీ
తీరున నిన్ను నీవ, వెత దీరెడుకాలము వచ్చె మాను క
న్నీరెవ రడ్డువారు విధినిర్ణయ మిట్టులయుండ, మీరు వి
న్నారలుగారె యీవిలసనం బొకశాపనిమిత్తమాటయుః.

క. ఇరువురకుఁగూడ నశివం
కర మగుశోకంబు వీడి కమలాక్షి ! తపః
పరవతివిగమ్మ సుతపో
గరిమంబునఁ బడయరానికార్యము గలదే. 209

గీ. గౌరి తపమునఁగా పొందఁగలిగె మన్మ
థారియర్ధాంగ మన్యదురాసదంబు
అట్లె సలిపి తపం బీవు నచిరముగనె
పుండరీకుశరీరంబుఁ బొందు మమ్మ ! 210

వ. అనియిట్లు కపింజలప్రబోధితయై మహాశ్వేత కొంతయూఱడిల్లె నంతఁ గాదంబరీదేవి దీనాననంబుతో మహాత్మా ! నీకు జలపాతసహచారిణి యగు పత్రలేఖ యేమయ్యె ననుడుఁ గపింజలుండు రాజపుత్త్రి ! యామెవృత్తాంతము నాకేమియు గోచరింపకయున్నది. చంద్రాత్మకుం డగుచంద్రాపీడుం డెందు జనించెనో పుండరీకాత్ముం డగువైశంపాయనుం డెందుండెనో పత్రలేఖ యేమయ్యెనో తెలిసికొనుటకే యిప్పుడు శ్వేతకేతుపితృపాదులసన్నిధి కరుగుచుంటి ననుచు గగనంబున కెగసిన రాజలోకంబును జంద్రాపీడుఁ

గాంచి కన్నీరువిడుచుచుఁ దమతమ మనికిపట్టులకరిగినఁ దద
ద్భుతాంతరితశోకవృత్తాంతయై కాదంబరి మహాశ్వేతం గని.

మ. చెలి! నీతోసమదుఃఖనైనకతనన్ జింతింప నన్ దుఃఖినిన్
సలిపెన్ దైవ మటంచు, నిప్పుడు ముదాస్యంబున్ గనన్
జేసి నె। చ్చెలి! యంచున్ నినుఁ బిల్వఁ బూనుటకు లజ్జిం
తున్ మదిన్ నిక్కపుం। జెలియున్ నే నిపుడైతి నీ కనుచు
హార్షింతున్ వయస్యామణీ! 212

చ. సరసిజనేత్రి! నాకు నొకసంశయ మాత్మజనించె దాని నె
వ్వరి కెఱిఁగింతు నెవ్వరు జవాబిడుదుర్ సఖి నీవగాకఁకన్
మరణము జీవనంబు నొకమాదిరినే మదిఁ దోఁచుచుండె ని
త్తరుణమునందు నాకు నుచితం బెదియో సెలవీయఁగా

క. ఏమి యొనరింప మేలో [ వలెన్.
నీమదిఁ జర్చించి నాకు నిజము తెలుపు మం
చీమాడ్కిఁ జిత్రరథతను
జామణి పచియింప హంససంభవ యనియెన్. 214

మ. నృపుదేహంబు నిజాంకమం దలరఁగా నీప్రశ్నతో నేమి
మా। యుపదేశంబులతోడ నేమి చెలియా! యుక్తం బయు
క్తంబు మే। ముపదేశించెదు వారమే ప్రియసమాయోగా శ
యే సంశయం। బవనోదించి యొనర్పఁజేయుఁ గరణీయం
బుల్ వెతన్ బాయుమా. 215

చ. వనజదళాక్షి! నీ కెఱుఁగవచ్చినదేసుమ పుండరీకువ
ర్తన మటువంటివేళ నెగదా మెయిఁదాలిచె నీవరాకి యొ
క్కనినుడి నీకు వల్లభునికాయమె చింతనయుండ వేఱుచిం
తన మిఁక నేల యీతనువుఁదన్పు మపూజల శ్రేయమబ్బెడిన్.

ఉ. కూరుచునంత శ్రేయములు గొబ్బునఁ బూజఁ బరోక్షదైవ
ముల్। దారుశిలామృదాకృతులై తజ్జ్ఞులు వల్కుదు రింతి! రా
ట్పుతా! కారుడు చంద్రుఁ డితఁడనఁగా శశి నిత్యముగోచరించు
బృం। దారకశేఖరుం డితనిఁ దన్విన నీకు శుభంబు గల్గదే ?

క. మురళీగానవిశారద
సరళహృదంభోజ ! సర్వశాస్త్రాభిజ్ఞా !
సరసార్థఘటనదక్షా !
నిరపాయప్రకృతివైద్యనిరవద్యమతీ ! 218

వసంతతిలకము

శ్రీమధ్వశాస్త్రపరిశీలనచారుకీర్తి !
భూమీసురవ్రకులభూషణ ! వ్యాసపుత్రా !
క్షేమంకరిష్ణువచనోర్జితసాధుభావా !
ధీమద్గణాభరణ ! దేశికదేశికేంద్రా ! 219

క. శ్రీమంగళనరసింహా
స్వామినివాసాంతికోల్లసద్గుండిమెడ
గ్రామస్వక నారంగా
రామారచితాశ్రమాంతరాళావాసా ! 220

—* గద్యము. *—

ఇది కాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్ర సకల
విద్వద్విధేయ పూర్ణప్రజ్ఞనామధేయప్రణీతం
బగు నాంధ్రకాదంబరియందు
సప్తమాశ్వాసంబు.

ఓమ్

శ్రీహయగ్రీవాయ నమః.

# ఆంధ్రకాదంబరి

## అష్టమాశ్వాసము



శ్రీ మధ్వమానివాక్య
స్తోమప్రత్యూహవిచారశుద్ధాత్మ! వచో
భామానవావతారా!
కోమలవాఙ్మాన్య! కృష్ణగురుమూర్ధన్యా!

వ. అవధరింపు మావలికథ జాబాలిమునీంద్రుండు హారీతాదులకుఁ జెప్పినట్లు శుకంబు శూద్రకునితో నిట్లనియె. 2

గీ. అంతఁ గాదంబరీదేవి యట్లు హంస
తనయ నుడివిన, రాసుతుతనువు నొక్క
భాస్వదశ్మతలంబుపై భద్రపఱచి
స్నానశుచియౌచుఁ బూజల సలుపఁదొడఁగె. 3

సీ. సింగారపుఁ దుస్తు లంగీకరింపక
మణికంకణం బొండుమాత్ర మూని

చిగురువాతెఱఁ గాఁపుసేసినతమ్ములఁ
పుంగింపురంగుఁ దొలంగఁజేసి
వెలలేనిజిలుఁగుదువ్వలువల మాని వి
రక్తిఁ గాషాయవస్త్రములె దాల్చి
సురతభోగానీతసురభివస్తువుల నే
ధూపానులేపనాదుల నొనర్చి
గీ. మూర్తిమంతమ్ము పెనుశోకమో యనంగ
నృపతిసుతు మేనిపై దృష్టి నిగుడఁజేసి
పూజసేయుచు మదిరాతనూజ యిట్టు
లన్నమే నొల్లక యె దినమెల్లఁ గడపె. 4

ఉ. భీకరవార్షుకాభ్రరవభీషణమై నిబిడాంధకారమై
భేకవచఃకృతశ్రవణపీడనమై చపలాపరిపాతదు
ర్లోకనయౌ నిశన్ బతివిలోకననిర్నిమిషాక్షియై మదిన్
శ్రీకి స్వభావమాభయముఁ జెందక యే గడపెన్ క్షణం
బుగన్. 5

గీ. తెల్లవారెడుసరికి నప్పల్లవోష్ఠి
విరియఁబాఱినమేలిచిత్తరువువోలెఁ
గానవచ్చెడిప్రియుమేను గాంచి పాణి
తో స్పృశించుచు మదలేఖతోడ ననియె. 6

గీ. సకియ! మదలేఖ! వివరింపఁజాల రుచియొ
నిర్వికారతయో! నేఁడు నృపకుమారు
తనువు తొంటివలెన్ దోఁచెఁ గనుల కరయు
మనుడు మదలేఖ పరికించి యనియె నిట్లు. 7

మ. సఖియా! జీవము లేమి తేనితను వస్త్రవ్యాప్తియుం బింతియే
మొకమా పార్వణచంద్రసాంద్రరుచి నోమున్ స్నిగ్ధవక్త్రం
బులై। చికురంబుల్ విలసిల్లు నర్ధశశి మించెన్ ఫాలమారా
శ్రవాం। తికవిశ్రాంతము లక్షులా యువికచనీలోత్పలశ్రీ
కముల్. 8

గీ. చెక్కు లద్దంబులట్లుగాఁ జెన్నుమీఱు
మోవి కెంజిగురాకుతో వావి నెఱపు
వెలయుఁ బాణిపదంబున వ్రేళ్ళు గోళ్ళు
విద్రుమాలోహితంబులై వెనుకటివలె. 9

వ. అమ్మా! సంశయింపఁ బనిలేదు. సర్వాంగీణంబు లగు సహజసౌందర్యసౌకుమార్యంబులు యథాపూర్వంబ. దివ్యభాషితం బమృషాభూతంబు. ఇయ్యది కపింజలావేదితం బగు శాపోదంతంబుగనే భావింతుననుడు నిర్భరానందయై కాదంబరి యావింత మహాశ్వేతకును రాజపుత్త్రినివహంబునకు నెఱింగింప రాజపుత్త్రినికాయ మక్కాయ మరసి యచ్చెరువడి ప్రణామంబు లాచరించి మోకాళ్ళపై నిలిచి కాదంబరీదేవి కిట్లు విన్నవించిరి. 10

మ. అతులంబౌ భవదీయమౌ మహిమ మోయబ్జాక్షి! యి
చ్చోట దు। ర్గతులన్ మమ్ముఁ ద్యజించి దూరగతుఁడౌ
రాట్సూనునెమ్మోమదే। శతపత్త్రోపమితాక్షియుగ్మ
మదె భాస్వచ్ఛోభమున్ గంటి మ।శ్రుతపూర్వంబు నదృ
ష్టపూర్వ మిటు లెచ్చోనేనిఁ గాదంబరీ! 11

క. అని రాజలోకమునఁ బరి
జనయుతయై లేచి యామె స్వయము తదీయా
ర్చనకై పూవులు గొని య
జ్జననాథకుమారుతనువు సంపూజించెన్. 12

వ. అంత రాజమండలంబు నిజాదేశనిర్వర్తితాహారంబగుడుఁ దానును మహాశ్వేతానీతంబు లగుఫలంబుల నామెతో నారగించి పదంపడి యెప్పటియట్ల చంద్రాపీడచరణంబుల నిజాంకపాళిఁ జేర్చుకొనియ యద్దివసంబు వెళ్ళఁబుచ్చి మఱునాఁడు రాజనందన పునర్జీవనదృఢవిశ్వాసయై మదలేఖం గని. 13

సీ. సకియ! యాశాపావసాన మాప్రియుమేని
నుపచరించుచు నుండు టొప్పుఁగాదె
ఈయద్భుతం బైనయుతివృత్త మీ వేగ
తలిదండ్రులకుఁ జెప్పవలయుసుమ్ము
అట్లని వారు న న్నన్యథా తలఁపక
నాయీవెతల మేను వాయకుండ్రు
ఒకవేళ చింతలో నున్నన్ గనఁగ వా
రాయతపడిన రానీయవలదు

గీ. అమ్మనయ్యను గని దుఃఖ మాఁపలేను
మేలుకాదని పతిమృతికాలమందె
కంటనీ రిడనట్టినేఁ గాంతుఁ డిపుడు
బ్రతుకు ననునాస యుండ నెప్పగిది నేడ్తు. 14

క. అని యనుపఁగ మదలేఖయుఁ
జని వెండియు వచ్చి పలికె సకితోఁ జెలియా!
ఒనఁగూడె నీదుకోర్కియు
నినుఁ గౌఁగిటఁ జేర్చి యనిరి నీతలిదండ్రుల్. 15

మ. తనయా! నీవరుకోస మీవఱకు నాత్మం జింతయే చేయు
మీ। వనురూపుం బ్రియుఁ గోరుకొంట మనికిన్
హర్షంబు చేకూరె నం। దును నీకోరినవాఁడు లోకపతి
చంద్రుండంట సంతోసమా। విన, జామాతృయుతన్
నినుఁ గనఁగ నువ్విళ్ళూరు మా డెందముల్. 16

క. శాపావసానమునఁ జం
ద్రాపీడునితోడ నీవు రా, నీముఖతా
రాపతిఁ గని యస్మన్మద
కూపారము పొంగుఁగాతఁ గూఁతుర! వేగన్. 17

క. నావుడు నిర్వృతయై యా
దేవి మఱొం డేమి లేక దేవునిబోలెన్
భూవిభుకుమారు దేహము
సేవించుచునుండె నంద చిత్తము హత్తన్. 18

క. సురపథమందున మబ్బుల
తెర లుడుగుటఁ బాడవులయ్యె దెస లంబుదపున్
జెర తొలఁగె జీవకోటికి
శరదాగమ మంత ముదము సంధించెఁ గడున్. 19

సీ. పొలిమేర లురుసస్యముల నుదారము లాయె
రెల్లుపూవుల వనుల్ తెల్లనాయెఁ

ప్రాసాదములు కామివాసయోగ్యము లాయె
మునిమాపె వెన్నెలల్ మోపు లాయె
రాత్రు లుత్ఫుల్లకైరవసౌరభము లాయె
దినములు జలజగంధిలము లాయెఁ
దటినులు సులభసంతరణశక్యము లాయె
సరణు లశ్వఖురాగ్రసహము లాయె
గీ. తెల్లవాఱెడుతఱిఁ బిల్లతెమ్మెరలకు
నల్లవావిలిపాలుపులఁ జల్ల నాయె
విరహిజనములకును దురపిల్ల నాయె
శరదుదయలక్ష్మి కెందేని సాటి గలదె ? 20

వ. అట్టితఱి మేఘనాదుండు చంద్రాపీడచరణమూలోపవిష్ట యగు కాదంబరికి జోహారొనరించి ‘ అమ్మా ! యువరాజు జాగొనరించెనని తారాపీడమహారాజును విలాసవతీమహాదేవియు సచివశేఖరుండును వార్తాహరులఁ బంపిరి. దేవికిఁ దిరుగ శోకోదయంబు లేకుండుతమని మేమే యువ్వారి కీయుదంత మంతయు నెఱింగించి మీకు వేఱే చెప్పనదేదియు లేదు. మీ రరిగి యువ్వార్తయ దేవి కెఱింగింపుఁ ’ డన వారును మన్యుపరీతులై. 21

ఉ. ఇంతటిమేర వచ్చి ధరణీశు నెయ్యుఁ గనకుండఁ బోవ మే
మంతయు పుణ్యకర్ములమె యక్కట! యానరపాలు చెంత మా
కింతకు లేదొకో చనవు హీనము మాబ్రతు కాయె మ్రొ
క్కి ప్రార్థింతుము దేవి నా నను మతింపక పంపుట మీకు
న్యాయమే. 22

మ. సవిశేషంబులు భక్తిసఖ్యసహసంచారంబు లట్లుండనీ
యవకాశం బది యున్న రాకొమరుదేహంబేని వీక్షింపకే,
యవనీనాథునితోడ నేమనుదుమయ్యా! కూర్పు కాదంబరీ
సవిధంబందునఁ జెప్పి రాట్సుతతనూసందర్శన శ్రీయమున్.

క. అని విన్నవించుచుండిరి
వినిచితి మీచిత్త మనిన వెలవడి మదిరా
తనయ తనశ్వశురకులమున
కొనఁగూడిన వెతకు నాత్మ నుడుకుచు ననియెన్. 24

చ. అరుగము మేము రాకొమరునాననముం గనకే యటంచుఁ
గిం । కరు లగువారు పల్కుటది కర్జము, కాంచియు నిద్ది
విశ్వసిం । పర యనఁ గాంచకున్న నిఁకఁ బల్కెడిదేమి
ఫలింపఁజేయుఁడీ । దరిసెనముం ఘటించి కనుదమ్ముల
తోడఁ దదీయయానముల్. 25

వ. అని కాదంబరీదేవి యానతీయఁ దత్క్షణంబ మేఘనాదప్రవే
శితులై యావార్తాహరులు రాకుమారుశరీరంబు నిరీక్షించి
పంచాంగాలింగితమహీతలులై ప్రణామంబు గావించి బా
ష్పతరళితాక్షులై నిలువ మదిరానందన యవ్వారిం గని

సీ. సుముఖులారా! స్నేహసులభమా శోకంబు
విడనాడఁగాఁ దగు నెడఁదనుండి
అనవధికంబు దుఃఖాంతమా దుఃఖంబు
మరణకాతరు దుఃఖమఱచుఁగాక
సావధి సౌఖ్యావసాయియానది భావి
సుఖవాంఛ శోకంబు సోఁకనీదు

వింటిరిగాదె యీవింతవృత్తం బవ
కాశ మెక్కడిది శోకమున కిపుడు
ఆ. ఈయపూర్వవిషయ మెందేని గంటిరే
చూడుఁ డదిగొ రాజసుతునిమోము
పూర్వమట్ల కాంతిపుంజంబుతో నొప్పి
పూర్ణిమాశశాంకుఁ బోలుచుండె. 27
క. బ్రతుకును రాకొమరుఁడు సూ
నృత మిది మీ రేఁగి యిప్పుడే సుతవార్తా
రతుఁ డగుతారాపీడ
క్షితిపతి కీయద్భుతంబు చెప్పఁగ వలయున్. 28
గీ. చెప్పుతఱి రాకుమారు దర్శించినార
మల్లయచ్ఛోదతటి నుండె ననఁగవలయు;
ఉన్న దున్నట్లు చెప్పిన నొక్కవేళఁ
గార్యగతులఁ బ్రమాదంబు గలుగవచ్చు. 29
చ. మృతిఁగనె రాసుతుం డతనిమేను సజీవత నొప్పె నన్న
యీ । కత నొరు లేరు నమ్మెదరు కన్గొనకుండ, నృపుండు
పట్టి తా । మృతిఁగనె నంట నిక్కముగ మే నవినశ్వర
మ్మంటఁ గల్లగా।మతిఁ దలపోసె నేనియుఁ బ్రమాదము చే
కురుఁగాదె య త్తఱిన్. 30
గీ. జీవితేశ్వరుఁడే పునర్జీవుఁ డగుడు
నేగు నెల్లెడఁ దనకుఁదా నీయుదంత
మంతవఱకును దూరంబునందు నున్న
గురుజనముఁ బ్రోచు టెల్లెని వరము కాదె. 31

క. అని మదిరానందన యన
విని వార్తాహరులు విన్నవించిరి యట మా
చనమిఁక జని వాకొనమిఁక
జనయిత్రి! యిద్ది పొసఁగు, సంభవమె యిటుల్. 32

శా. తారాపీడనృపుండు రాజ్ఞియు సమాత్యశ్రేష్ఠుఁడున్
మమ్ము సత్కారంబొప్పఁగ నిట్లుపంపి సుతవార్తల్ విం
టకుం జిత్తము దారాటంపడ జీవముండియును మే మచ్చో
టికే పోమె? కన్నీరొప్పారెడు వారిమోముఁ గనియున్
ధీరత్వముఁ గాంతుమే. 33

వ. అనినఁ గాదంబరియు నది యట్లయని మేఘనాదువలనై మేఘనాదా! పరిచితజనంబునకిది యనుచితంబని యెఱుంగుదు. గురుజనంబునకు మనఃఖేదంబుఁ బరిహరింప నిట్లంటిని. వారి విశ్వాసార్థ మిత్త్వరితో విదితోదంతుం డగు నొక్క శ్రద్ధేయవచనుండు పోవ్వట శ్రేయమని తోఁచెడినన మేఘనాదుండిట్లనియె. 34

గీ. అమ్మ! యీరాజపుత్త్రిలోకమ్ము మాట
యట్లు లుంచుమ, భృత్యులయందు నొకఁడు
నృపకుమారుని విడిచిపో నిష్టపడఁడు
కందమూలాలఁ దినుచుందె యుందుమందు్రి. 35

ఉ. వారలె భృత్యులెవ్వరు విపత్తులయందును జేనిఁ బాయరో
గౌరవముం బొనర్చుతఱి గర్వితులై కదుఁదు్రిళ్లరో బహూ
కారపువేళలందు సముఖంబున నిల్వక వెన్క నుందురో
పోరుల ముందుగా నిలిచిపొల్తురొ యెక్కుఁగంబముల్బలెన్

గీ. పెద్దపెద్దపదవులఁ బ్రాపించుకొలఁది
నమ్రు లగుదురు విసుఁగుకొన్న నపరక్తిఁ
జూప రెదురు వచింపరు కోపగింప
భృత్యులన నిట్టివారెగా పృథ్వియందు. 37

గీ. చెప్పకున్నను గార్యముల్ చేయుచుందు్రు,
చేసి చెప్పరు, విక్రమించియును బోరఁ
బొగడికొన, రన్యు లెవరేనిఁ బొగడ శిరము
వంచుకొందురు వీరె సేవకులు పతికి. 38

చ. ధనమునకన్న నెయ్యమె యుదాత్తము వారికి జీవితంబుక
న్నను మరణించుటే కడుఘనంబని యెంతురు వారు, గేహసీ
మను నివసించుకంటె యజమానపదాంబుజసన్నిధానమం
దునికియె వారికిన్ గుతుక ముత్తము సేవకు లిట్టివారెగా.

గీ. వీరికిన్ దృష్ణ లేని సేవించుటంద
చింత నరకాంతుముఖము దర్శించుటంద
పిసినిగొట్టుతనము నృపు విడమియంద
వదరుపోఁతయుఁ బలిగుణావర్తమంద. 40

క. వినుచున్ జెవుటులు మఱి వా
కొనుచున్ మూఁగలును గనుచు గుడ్డులు కాళ్ళన్
జనుచున్ గుంటులు జగతిన్
జననాథాధీను లగుట సద్భృత్యమణుల్. 41

వ. భర్తృదారికా! రాకుమారుభృత్యు లెల్ల నిట్టివార. సంశ
యము లేదు. రాజకుమారు స్థానంబున నీవ కలవు. ఆనతి

నెఱవేఱెనని యే తలంపుమని కుమారబాల్యసేవకుం డగు
త్వరితకుని వారితో నంపిన వారును గ్రమంబుగ నవంతీ
పురంబు సొచ్చిన నట. 42

ఉ. ఆతఁడె నవ్విలాసవతి యట్లు కుమారుఁడు రామిఁ బొక్కు-
డుఁ। జేతము మాతృకాలయముఁ జేరి సుతాప్తి కవంతి
దేవతా। వ్రాతముఁ బూజసల్పుటకు వచ్చినఁ జెచ్చెర నేగు
దెంచి యం। దాతరళాయతాక్షి కిటు లాడెను భృత్యజనం
బు పొంగుచున్. 43

గీ. అమ్మ! వర్ధిల్లు మీయదృష్టమ్ము పండె
రాజ్ఞి! ఫలియించె దేవతారాధనంబు
రాకుమారునివార్త లారయుఁగఁ జనిన
వారు వచ్చుచున్నారు వారె యనిన. 44

గీ. ఎవ్వ రివ్వార్త నాచెప్వ కింపొనర్చి
రెందుఁ గంటిరి సుఖమె నానందనునకు
అనుచు వత్సంబుఁ బాసినహారిణి వోలెఁ
జూపు నిగిడించి దెసలపైఁ జూచి యామె. 45

చ. అనుగడుగందుఁ బౌరు లిసుమైనను రాలనియట్లు గుంపులై
యొడయునిపట్టిఁగూర్చి సచివోత్తము పుత్త్రినిగూర్చి వారి
వెం। బడిఁ జనువారిఁగూరిచియుఁ బ్రశ్నములన్ బొనరింపఁ
గా జవా। బిడక యె వచ్చువార్తికుల నిద్ధవిచారులఁ జూచె
వెంటనే. 46

ఉ. వారిని దోడితేరఁ బరివారముఁ బంపుడు వారు నేఁగి దే
వేరి యిటానతిచ్చె నరవిన్ జనుదెం డనఁ దప్పరామి న

వ్వారరుదెంచి దేవి కశుభం బెటుచెప్పుదు మంచుఁ గారుక
న్నీరు నమస్కృతిచ్ఛలన నిర్గతముల్ బొనరించి నిల్చినన్. 47

వ. అవ్విలాసవతీదేవి వారల కభిముఖియై భద్రులార! వేగంబ
వచింపుఁడు. నాహృదయంబు పాపాశంకియై యొప్పెడు.

క. ఆరసితిరె సుఖియై యే
పారునె సుతుఁ డన్న వారు నచ్ఛోదసర
స్తీరమున నారసితిమి కు
మారున్ ద్వరితకుఁడు మీఁదిమాట వినుచు నాన్. 49

మ. ప్రతిలేఖంబులు లేనిమీఁశిరములున్ బ్రిత్యగ్రబాష్పాను
బం । ధితముల్ మీఁకనులున్ విషణ్ణములు మీదీనాననం
బుల్ నిరా । కృతహర్షంబులు మీదురాకలును బల్కన్
గాదె వక్తవ్యము । న్నతులారా! యితఁ డేమి వల్కన్ నిఁక
నన్యం బంచు దుఃఖార్తయై. 50

సీ. హాతనయా ! జగదభినంద్యచరిత ! చం
ద్రాపీడ ! లోచనానందభూత !
రావైతి విచటి కేరా కుమారా ! కటా !
యింతలో నీకంత యేమి వచ్చె ?
కినుకఁ గాదు హృదార్తి ననుదుఁ 'దల్లీ ! జాగు
చేయు' నంచని యిట్లు చేయ నగునె ?
అది యేమొ నీవేగునపుడె నిన్ గను టింక
దుర్లభంబని మదిఁ దోఁచె నాకు
గీ. ఆఁపినను నాఁగకుండనే యరిగినావు
కట్ట ! నే నేమిసేయఁగాఁ గలను కూర్మి

పట్టి! నిన్నన్నఫలమే మభాగ్యరాల
నింతకే నోఁచికొంటి నా కెక్కు డెట్లు? 51

క. తక్కువనోములు నోఁచిన
యక్కలు పలుమంది వారియం దీదృశి లే
దొక్కతెయు, నాకుఁ బుత్త్రిఁడ
వొక్కఁడ వీ విట్టులైతి వోగుణరాశీ! 52

గీ. దవ్వునం దున్ననీదుపాదముల కేను
మ్రొక్కెదను దర్శనమ్మిడు మొక్కమాఱు
అమ్మ యనిపిల్చునీదుముఖమ్ముఁ జూడఁ
గోడుక! నామది యారాటపడుచు నుండె. 53

ఉ. చిన్నతనంపునీకొమరుఁజెయ్వులఁ దలపోసి యేడ్తునో
యున్నవయఃసమావనంబుతటి సింపెసలారెడునీమనోపసం
పన్నత నెన్ని కుందుదునో భావిభవత్ప్రభుతావిభూతిసౌ
ఖ్యోన్నతి నెంచి చింతిలుదునో వచియింపు మెఱుంగఁ
బుత్త్రికా! 54

గీ. ఇట్లు దీనంబుగా నేడ్చునీపెఁ గాంచి
నాదుమది నివసించునోనందనుండ!
'పాసియును నన్ను బ్రదికె విలాసవతి' య
టంచు నించుకయును మది నెంచఁబోకు. 55

గీ. వత్స! నిన్ విడనాడి జీవంబుతోడ
నుండియును నేను దుదకు మీతండ్రికేని
నాదుమొగమును జూపించినానె? తండ్రి!
యేమిదైతివో నీస్థితి యెఱుఁగనైతి. 56

క. ఎక్కటితన హృదయ మిది వే
వ్రక్కలు గాదో యెఱుంగ వత్సా! నీపై
మక్కువ స్త్రీమూఢత నీ
యిక్కట్టున్ విశ్వసింప దెద యిప్పటికిన్. 57

క. అడిగినఁ ద్వరితకు నోటన్
బిడుగున కెనయైనయెట్టి బెడిదపుఁబలుకుం
బడి వినవచ్చునో యని నే
నడుగుటయే మానికొంటి నయ్య కుమారా! 58

గీ. తండ్రి! యేమందుఁ బుత్త్రివత్సలత కనుచి
తమ్ము లజ్జాకరమ్ము శోక మ్మదేల
యనియొకో, యేడ్పు మానెద నయ్య యనుచుఁ
జింత రెట్టింప రాణి మూర్ఛిల్లె నంత. 59

వ. తదీయపరిజనమ్ము వేగమ్మునఁ బోయి యీ యుదంతమ్ము ఱేని కెఱింగింప మహారాజు శుకనాసద్వితీయుండై కరేణు వధిరోహించి యుజ్జయిని నిర్గమించి యవంతీమాతృకాలయంబుఁ బ్రవేశించి యటఁ బరిజనశీతలోపచారంబుల మూర్ఛదేఱుచున్నవిలాసవతిం గని బాష్పపూర్ణలోచనుఁడై కరంబుచే నామెను స్పృశించుచు నెలుంగు డగ్గుత్తికపడ మెల్లగా నిట్లనియె. 60

శా. దేవీ! నిక్కువమేనిఁ బుత్త్రినకుఁ దాదృక్కష్టమే యీవ
యిన్! జీవింపన్ బనిలేద యందఱువలెన్ జింతించి పుత్త్రా
ర్థ మీ! జీవం బల్ప మొనర్తు వింతవఱకే చేయంబడెన్
బున్నెముల్! పూవుంబోఁడి! యెటుల్ ఘటిల్లు ఫలముల్
పుణ్యాధికశ్రీకముల్. 61

ఉ. చేసినవారికిన్ జగతిఁ జేసినయంతయు నెంతయత్నముల్
జేసియుఁ బ్రాణి పుణ్యమును జేయక యే ఫల మందఁజాలఁ
డో! భాసురగాత్రి! యందఱికిఁ బై విధి యుండు నతం డదేని
యుం! జేసినఁ జేయు నైన మనచేయనిపుణ్యము లేవి
కోమలీ! 62

సీ. అత్యంతవైభవం బలరారఁ దనుజాత
జననోత్సవంబును సలిపినాము
ఒడియందుఁ బసిపాప నిడికొని కన్నుల
కలవుదీరఁగ మోముఁ గాంచినాము
ఉత్తానశయు నంఘ్రి లెత్తి ముద్దాడుచు
నుత్తమాంగమునందు హత్తినాము
దోఁగాడు చోడిఁ జేరుధూళిధూసరదేహు
బాలుఁ దాఁకి సుఖాబ్ధిఁ దేలినాము

గీ. మంజులమ్ములు నవ్యక్తమధురిమములు
బాలభాషణములు విని బ్రమసినాము
ఆటపాటలఁ గని ముదం బందినాము
ముద్దుముచ్చటలన్ జూచి మురిసినాము. 63

మ. గురువిద్యాబలునిన్ వినీతు సుతుఁ గన్గొన్నాము తారుణ్య
మం। దరయన్ జాలితి మప్రతీప మమనుష్యం బైన దో
శ్శక్తియున్। నిరవద్యం బగురూపునొప్పెసఁగువానిన్,
యౌవరాజ్యస్థత। చ్ఛిరమున్ మూర్కొనినాము దిగ్విజ
యి నాశ్లేషించినా మే మిఁకన్. 64

ఉ. ఒక్కటియే కొఱంత యెపుడుల్లమునం దలపోయుచుండు నీ
ఫక్కి వధూసమేతు సుతుఁ బాలనకృత్యమునందు యుంచి యే
చిక్కులు లేక నే వని వసింపుదు నంచని తీర దద్ది నా
కక్కట! సర్వవాంఛితము లబ్బుట యెంతటివారికోఁగదా!

గీ. ఐన నేమాయె నిప్పు డజ్ఞాయతాక్షి!
తనయువర్తనమును త్వరితకునివలనఁ
బూర్ణముగ విన్నపైఁగదా నిర్ణయింపఁ
జెల్లు మన కింక మరణమో జీవితంబొ. 66

వ. అని యిట్లు తారాపీడమహారాజు వచించుచుండఁగనే ప్రతీహారుండు త్వరితకు మహీపతికిఁ గనంబఱచిన జేఁ దుపాదానతుం డగునతనిఁ గుమారగౌరవంబుచే శిరంబు నంటుచు ‘భద్రా! మేము లేఖలఁ బంపినను గుమారుఁ డేల రాఁడయ్యె? రాని కారణం బేని యేల లిఖింపఁడాయె’ నన్న నాతండు తదీయవృత్తాంతము సవిస్తరంబుగా వినిపించినఁ దారాపీడుండు కుమారుహృదయస్ఫోటన మాలించి క్షుభితేంద్రియుండై. 67

సీ. చెప్పం దగినదానిఁ జెప్పినాఁడవు నీవు
వినవలసినదాని వింటి మేము
పరిపూర్ణమయ్యె నాప్రశ్నాభిలాషంబు
కర్ణకౌతుకము సంఘటితమాయె
శ్రవణయుగం బిదే చరితార్థమాయెను
మన సెంతయేనియుఁ దనివి నొందె

స్వస్థచిత్తుఁడనైతి సౌఖ్యంబు గనుగొంటి
నుల్లాస మెంతయు నెల్లివిరిసెఁ
గీ. ద్వరితకా ! యూఁపుమా కొంతతడవు దీనిఁ
జాలుఁ జెప్పిన దిఁక వినఁజాలఁ బైన
దళితమాయెను నీదుహృదయము పుత్రి!
అయ్యొ! యొక్కఁడ వెట్లోర్చితయ్య నీవు. 68

క. తనయ! తెలిసె వైశంపా
యనుపై నీకున్న నెయ్య మది హృదయవిభే
దనమున, నిది విని దుఃఖం
బున కేమో మాదుహృదయములు పగుల వహో! 69

గీ. దేవి! మనహృదయమ్ములు దేవుఁ డల్ల
వజ్రములఁ జేసెఁ బగుల వీవార్త, సుతుని
వెంటఁ జన వసువులు మృతిభీతి, స్వయము
కలిసికొందము సుతుని వేగమ్మ లెమ్మ. 70

సీ. శుకనాస ! యే మట్లుచూచెదు చిత్రిఁ బేర్వ
ననుచరులకు వేగ నానతిమ్మ
కాష్ఠికుల్ వడి మహాకాళదేవగృహంబు
చెంతకు దారువుల్ చేర్ప రేమి?
కాంచుకీయులు పావకప్రవేశార్థసం
భారంబులను సిద్ధపఱుప రేల ?
దేవి! విలాసవతీ! కోశ మఖిలమ్ము
బ్రాహ్మణోత్తములకుఁ బంచిపెట్టు
గీ. చనుఁడు నృపులార! మీరు మీస్థానములకుఁ

దెలుపఁడు ప్రజ కిపుడె యీదీనవార్త
పుత్త్రుఁడు కథావశిష్టుఁ డైపోయె నెవని
నన్ను నిల్పును నీరాజ్యమందు నింక. 71

వ. అని విలపించుచు నగణితాత్మపీడ యగువిలాసవతిచే నవలంబితుండై యున్నఱేనిఁ గని త్వరితకుండు ‘ మహారాజా! రాకుమారుహృదయమ్ము స్ఫుటితమయ్యె శరీరంబు సజీవంబ. శాపవశంబున వైశంపాయనుండును జన్మాంతరంబునం దున్నవాఁడు. దేవరవారీయుదంతమ్ము నిరవశేషమ్ముగా విందురుగాక యని యది యెల్లఁ దెల్లం బొనర్చిన ఱేఁడును ద్వరితకుండు శ్రద్ధేయవచనుం డగుట నొక్కింత విమర్శించి శుకనాసుముఖం బరసిన నతండును నిజకుమారదుఃఖదోదూయమానమానసుం డయ్యు ఱేని నూఱడించుచు నిట్లనియె. 72

గీ. అధిప! యీచిత్రసంసారమందుఁ బ్రకృతి
పరిణతిఁ సదసత్కర్మపాకమునను
ఏవి సంభావనీయముల్ గావు దేవ
దనుజతిర్యఙ్మనుష్యసంతానమందు. 73

గీ. మానవాధీశ ! యిందు విమర్శ మేల
యందకుండియు యుక్తుల కనుభవమున
నప్రతీపంబులై యాగమప్రమాణ
సుప్రసిద్ధంబు లెన్నివస్తువులు లేవు ? 74

క. సంతసమున లేచు గరు
త్మంతునిమంత్రమున భుజగదష్టుఁ, డిను మయు

స్వాంతసమాకృష్టంబై
వింతఁగొలుపు యుక్తు లేవి వీనికి నెల్లన్ ? 75

సీ. నహుషుఁ డగస్త్యశాపహతి భ్రష్టాత్ముఁడై
యజగరభావంబు నందుటయును
సౌదాసుఁడు వసిష్ఠజాతశాపమున మా
నిసిదిండిగాఁగ జన్మించుటయును
జనకుచే శప్తుఁడై చండాలతఁ ద్రిశంకు
పృథివీశ్వరుండు ప్రాపించుటయును
భార్గవుశాపంబు పాటి యయాతిదా
ఋంచుప్రాయం బస్తమించుటయును
గీ. శాపమున గంగ శంతనుజాయ యగుట
వసువు లెనమండ్రు నామెకు నిసువు లగుట
విందుముకదా పురాణంబులందు నెపుడు
శాపములు గల్లలని యెంచఁజనునె భూప ! 76

మ. అనుమానంబొకొ దేవతల్ మనుజలం దావిర్భవం బందు
టన్ ! వినలేదే జమదగ్నికిన్ దనయుఁడై విష్ణుండు జన్మిం
చుటన్ ! వనజాతాక్షుఁడు కోసలాధిపతికిన్ వంశాంకురం
బౌటయున్ ! సునయుండై వసుదేవనామునకు శ్రీశుం
డాత్మజుం డౌటయున్. 77

గీ. వారు మిన్నలె దేవరవారికంటెఁ
జంద్రుఁడన విష్ణువునకు లోచనము కాదె
భేద మెది, శాప మది నమ్మరా దనంగఁ
బార్థివోత్తమ ! యిం దసంభావ్య మేమి ? 78

చ. అనఘులు వీరు గర్భములయం దలరార విధుండు త్వత్ప్రి
యాం। గనముఖమున్ జొరంబడుటఁగాంచవె యేనును
బుండరీకుద। ర్శన మొనరింపనే కలల సంశయమేమిటి కీప్ర
వృత్తిలో। జనపతి! మీకు మాకును బ్రజాతతికిన్ సుఖ
మబ్బు నీవయిన్. 79

క. మృతునిశరీరం బిటు జీ
వితమై తనరారు ననఁగ వింటిమె యెందే
నితఁడు శశియాట నమృత
స్థితిచే నిది పాసఁగు శంకసేయఁ జన దిటన్. 80

గీ. మానవాధీశ! శాపావసాన మగుడు
నిటకు గంధర్వపుత్రితో నేగుదెంచి
మీపదాబ్జంబులకుఁ బ్రణమిల్లుసుతుని
శీఘ్రకాలంబులోనె కాంచెదవుసుమ్ము! 81

వ. దేవియు దేవరయు నీవిషయంబునఁ జింతింప నవసరంబు
లేదు. అభిమతదేవతారాధనాదులఁ దదాగమనంబు నిరీ
క్షించుటయ లెస్స నావుడుఁ దారాపీడధరాఖండలుండు
శుకనాసువలనై. 82

చ. నినుఁ గడవంగఁజాలినమనీషి యెవం డిటుమాకు నీవలెన్
వినిచెడివారు నెవ్వరు వివేకధనాగ్రణి! పుత్త్రహృద్వ్యథే
దన మది విన్నదాది కలఁతన్ గొనె నాదుమనంబు బాలకున్
గనుఁగొనకుండ నూఱటముఁ గాంచదు నాహృదయంబు
చెప్పితిన్. 83

క. నాకే యిటులుండిన న
య్యో! కన్నది రాణి కెట్టు లుండునొ గాదే
రాకొమరుని గాంచిననే
గాక మనుట యింక నాకుఁ గష్టము సచివా! 84

చ. అనఁ బతి యవ్విలాసవతి యంతట నిట్లనె నార్యపుత్త్ర! జా
గొనరుప నేల యిట్లు మది నుండిన, నందనువార్త విన్నయం
త నసువు లేగవాయె సుతదర్శనభాగ్యము కోసమే యి
ప్పని యొనఁగూడ నిందనుకఁ బ్రాణము దాల్చుఫలంబు
చేకుఱున్. 85

గీ. అని యిటుల్ దేవి పల్కెడునవసరమునఁ
బరిణతవయస్కుఁ డగునొక్కబ్రాహ్మణుండు
సరఁగ రాణి సమీపించి స్వస్తిపూర్వ
కంబుగా నివ్విధిని విన్నపం బొనర్చె. 86

క. దేవేరి! మనోరమ యే
దో విని సుతుఁగూర్చి చింతతోఁ జేరి యిటన్
భూవిభుఁ డుండుట సిగ్గున
దేవగృహమువెన్క నిల్చి దేవి నడిగెడున్. 87

మ. సకియా! ప్రాణముతోడ నుండెనొకొ వైశంపాయనుం
డందు రా। జకుమారుండు కుమారుతోఁ గలసెనా సౌ
ఖ్యంబె యవ్వారి కిం। తకు నెందుండిరి యెన్నినాళ్ళ కిట
కాధన్యాత్ము లేతెంతు రీ। సకలంబుం బ్రకటించి నాదగు
మనశ్శల్యంబుఁ బోఁ జేయుమా. 88

వ. నావుడుఁ దారాపీడుండు కుమారహృదయస్ఫోటనవార్త కంటె మనోరమాప్రశ్నశ్రవణంబున విదీర్ణహృదయుండై తనకంటె వేయిమడుంగుల నడలుచున్నరాణిం గని యూఱడించి విలాసవతీ! మనోరమ సుతులవృత్తాంత మొక్కింతయు నెఱుంగదు. అన్యనివేదితమై శోకాతిరేకంబున జీవంబు వాయవచ్చు. నీవ యేగి యథార్థనివేదనంబున నామె నూఱడింపఁజేయుమని సపరివారఁగా నంపి తాను శుకనాసునితోఁ బ్రయాణంబు సాఁగింప రాజాదరంబునను రాకుమారుపై ననురాగంబునను రక్షకవర్గంబుదప్ప నుజ్జయిని యెల్లను బ్రయాణమయిన నృపాలుండు శీఘ్రగమననిరోధకంబని కతిపయపరివారంబుతోఁ గుమారాలోకనార్థియై చనుచుఁగొన్నిదినంబులకు నచ్ఛోదంబు చేరి యట వృత్తాంత మెఱుంగఁ ద్వరితకునితో నాశ్వికపరివార మంపిన మలినీకృతకాయుండై వారితోన చనుదెంచు రాజపుత్త్రిమండల మీక్షించి కించిదుచ్ఛ్వసితుండై తారాపీడుండు విలాసవతి కిట్లనియె. 89

గీ. దేవి! మన భాగ్యమునఁ బుత్త్రిదివ్యదేహ
మట్లె యవినాశిగా నున్నదనియె తలఁతుఁ
దచ్చరణసేవిరాజపుత్త్రినివహంబు
కొమరుకడనుండి వచ్చెడు రమణి! కనుమ. 90

చ. అనపుడు రాణి మేలిముసుఁ గల్లనఁద్రోసి కుమారవర్గముల్
గని కొడుకందు లేమికి వగల్ మిగులన్ విలపించె నిట్టులో

యనుఁగుసుతా! శిశుత్వమున నాటల నీకు సహాయులైనరా
తనయులలోన నీవ కనుఁదమ్ములకుం గనిపింప వేమిరా.

గీ. అంచు విలపించుసతి నూఱడించి ఱేఁడు
మేఘనాదుఁడ! వార్తలేమి యని యడుగ
నాతఁడిట్లనెఁ బ్రాణి లేదను టెగాని
రాజసుతునకు నానాఁడుఁ దేజ మెసఁగు. 92

క. అది విని సుతుఁ గనుతమి మదిఁ
గదియ నృపుఁడు దేవితోడఁ గరిణిపయిం బో
యి దిగ మహాశ్వేతాశ్రమ
పదముదరి లతాంగి తెలిసి పార్థివురాకన్. 93

మ. అకటా! యీగతి నెల్లవారి కెద నాయాసంబులం గూ
ర్చుచుం। సకలద్వేషిణిగా మనంగ విధి నిచ్చెల్ వ్రాసెనో
యొక్కనాఁ। టికి నాకుం మృతిలేద యంచుఁ దపి లో
డీకో గుహాభ్యంతరో। ర్వీకిఁ బాటెం మదిరాతనూభవ
యు మూర్ఛిల్లెం శుగాక్రాంతయై. 94

గీ. అట్టియెడ సచివాలంబుఁ డగుచు నృపతి
యేఁడి నాముద్దుఁగొడుకని యేడ్చుకొంచు
సచివగృహిణీగృహీతహస్తయయి రాణి
లో నరిగి సుప్తునట్లున్న సూనుఁ గనిరి. 95

గీ. కన్నకడుపౌట నందు నొక్కండ పుత్త్రుఁ
డౌట యోగ్యగుణుం డౌట నట్టియెడను
దల్లి చింతకు నంత మింతయని గలదె
ఇల బురదగాఁగ నాతల్లి యేడ్చె నిట్లు. 96

చ. సుత ! యిటురమ్ము రమ్ము నినుఁజూచి కడుం దడవాయె
నాయనా ! ప్రతివచనం బొసంగు మొకపారి ననుం గను
విచ్చి చూడు మీ ! గతిఁ బడియుండఁగాఁ దగవుగాదు మా
దంకముఁజేరి పుత్త్రకో ! చితబహుమానపాత్రమును జే
యుము నన్నుఁ గుమారరత్నమా ! 97

మ. చిఱుపాయంబున నేనియుం బెడచెవిం జేయంగలే దింతగాఁ
బరిదేవించిన నిప్డు నాపలుకులం బట్టీ ! చెవిం బెట్ట వేఁ
బరిభావించిన దేమి?యిప్పగిదిఁ గోపం బూన నాతండ్రి! నీ
చరణాబ్జంబులపై నిదేపడుదు దోసం బున్న మన్నింపుమా!

క. తనయా ! చంద్రాపీడా!
జనకునకుఁ మ్రొక్కవేమి సద్గుణరాశీ !
చన నెటకు నీగుణంబులు
తనుబంధులయెడల నే యుదాసీనతయా ? 99

వ. అని తదీయగుణగణంబులఁ దలపోయుచు విలపించు విలాస
వతితోఁ దారాపీడుం డిట్లనియె. 100

సీ. దేవి ! విలాసవతీ ! పుణ్యమున మన
గర్భమం దీతండు గలిగినాఁడు
దేవతామూర్తి యీధీరాత్ముఁ డితనికై
మానవోచితచింత మానవలయు
ఏడ్చియు నిటు లాభ మే మింకఁ గంఠ మే
బ్రద్దలౌ హృదయంబు బ్రద్దలగునె ?
ధారగాఁ గట్టి కన్నీరె కన్నులనుండి
పడుఁగాని దేహంబు పడదుసుమ్ము

గీ. వెడఁగుమాటలె వానుండి వెడలుఁగాని
వెడల వసువులు శోకంబు విడువు మింక
మనకె యిటులున్న శుకనాసుమాట యేమి ?
యామనోరమయాధికి నవధి యేది ? 101

క. సుతుఁ డరయఁడు మ మ్మనియెడు
వెత యొక్కటె మనకు నదియు వెడలుఁ దదాస్యం
బతివా ! కనుచో నీదం
పతులసుతుఁడు మృతుఁడు వీరిఁ బరికింపఁదగున్. 102

శా. ఏపూఁబోఁడిమహాప్రభావమున దేవీ! పుత్త్రుఁ డుజ్జీవియా
నాపద్మేక్షణ మస్మదాగమనచింతావేశసంజాతమూ
ర్ఛాపారంగత యాచు నీవఱకు సంజ్ఞంజెందకుండెం జెలుల్
వాపోఁజొచ్చిరి నీదుకోడలిపయిన్ వాలింపు నీచూపులన్.

గీ. ముందు నీకోడలిని నంకమందుఁ జేర్చి
కొని సచేతనఁ గావించుకొనుము పిదపఁ
గొమరుకై యేడ్వనగు యథేచ్ఛముగ ననుడు
మనుజపతి రాణిదెసను గన్గొనుచు లేచి. 104

గీ. ఏది గంధర్వరాట్సుత ? యెట మదీయ
తనయజీవప్రదాననిదానభూత ?
యనుచుఁ గాదంబరిం జేరి యామె నంక
తలిఁ గొనుచు నూఱడిల్లు మో తల్లి ! యనుచు. 105

మ. తనయస్పర్శనశీతలం బయినచేతన్ దాఁకుచున్ మోము
మో । మునఁ జెక్కుల్ నునుఁజెక్కులం దిడుచు నప్పూఁ
బోఁడి గంధర్వనం । దన! నీ విట్లగుదేని నేఁడుఁగొలెఁ జం

దాక్షిణ్యమే నేమి యరా। జననీ! నాసుతుఁకై సుధామయి
బలెఁ జన్మించినా వెంతయుఁ. 106

క. అనుచు విలాసవతీసతి
తనుమూర్ఛఁ దేర్చుపట్లఁ దగఁ జంద్రాపీ
డునినామము చెవిఁ బడుడుం
గనులు దెఱచి దెసలు చూచి కాదంబరియుఁ. 107

గీ. అత్తఱి వినీతిఁ గాంచినపున త్తమామ
లకు మహాభక్తితో నతులం బొనర్ప
వారు 'దీర్ఘసుమంగలీ భవ' యటంచుఁ
జిత్రరథునూర్జితనయ కాశీస్సు లిడిరి. 108

వ. అప్పుడు కాదంబరి వయస్యావలంబితయై విలాసవతికిఁ బృష్ఠంబుగా నాతిదూరంబునఁ గూర్చుండుడుఁ దారాపీడుండు గంధర్వపుత్రి మూర్ఛదేఱుట కుమారుండు పునర్జీవించుటకాఁ దలంచి పుత్త్రినంగంబు స్నేహానిర్భరంబు గాఁగనుచు ముద్దిడుకొనుచుఁ దాఁకుచు మదలేఖం బిలిచి.

మ. ఇపు డబ్బెఁ దనయావలోకనసుఖంబే, పుత్త్రికాయంబు
నే। యుపచారంబున నిల్పె నిందనుక నాయుష్మంతు రా
లింత క। య్యుపచారంబును మానరా దనుము మా
యుక్తిం దప్పంగాని, మే। ముపలక్షించెదివార మింతె
సుతరక్షోపాయ మిూయింతిదే. 110

క. ఏ ముండియు లేకుండియు
సామాన్యమె యేలతాంగిసంస్పర్శముచే

మాముద్దుపట్టి బ్రిదుకునో
యామెయె సుతుచెంత నుండి యరయన్ వలయున్. 111

క. అని యానతిచ్చి వాసం
బునకుం జనకుండ మునిసముచితతరుని కే
తనమున శిలైకదేశం
బున నుండి నృపాలచక్రమున కిట్లనియెన్. 112

శా. శోకోద్రేకత దీనిఁ బూనితి నటంచున్ జూడకుండీ స్నుషా
లోకంబుం బొనరించి రాజ్యమున బాలున్ సుప్రతిష్ఠించి నే
నీకాలంబును దైవచింతనముతో నెంతే వనిన్ బుచ్చఁగా
నాకాంక్షించితి మున్నె దాని కసహాయుం బయ్యె దైవం [బిటుల్.

క. కానిందు విధిని దాఁటం
గా నెవనికి శక్యమగును గష్టమొ సుఖమో
మానవుఁడు చేసికొన్నది
తానేగద యనుభవింపఁదగు నెప్పట్లన్. 114

చ. నరపతులార! భూప్రజ ఘనంబుగఁ బ్రోవ భవద్భుజంబులే
తిరముగ నుండఁగా ముదిమి దెర్కొనుటన్ మఱి యిందు
నున్నమీ! గురుతరసాహాయ్యసంపదనె గోరుదుఁ గావున
నింతనుండియే! చిరముగ నున్న కాంక్షితము సిద్ధియొనర్ప
మదిన్ దలంచితిన్. 115

గీ. వారె ధన్యాత్ము లెవ రాత్మభార మెల్లఁ
దనుభవులయందు నుంచి వార్ధకమునందు
లఘుతరశరీరులై మోక్షలక్ష్మికొఱకుఁ
గాలమును దైవచింతతోఁ గడపుకొంద్రు. 116

మ. మెడపైఁ గాలిడి కాలుఁ డెంతయును బల్మిన్ దీనిఁ గైకోనియ । ప్పుడె తెల్విం బడి పాతుఁ డౌనతని కీభూభార మర్పించి నే । ర్పడరన్ గీడుకొటారమై మునలివగ్గై దుష్టమై హేయమా । బడుగున్ దేహముతోడ మోక్షపద మొప్పంగొంట సామాన్యమే. 117

వ. ఇయ్యర్థంబు నిమిత్తంబు మిమ్మర్థించుచుంటి. వేఱుగాఁ దలంపఁబోకుఁడని యుచితసుఖంబులఁ బరిత్యజించి— 118

సీ. తరుతలంబులనె సౌధములుగా భావించె
హరిణంబులనె చెలు లని తలంచె
లతలందె యువరోధసతులకూరిమి నుంచెఁ
దరులందె పుత్త్రివత్సలత నించె
వల్కలంబులనె దువ్వలువలుగా నెంచె
శమమందె సమరరసము వహించెఁ
దపమందె కోశాభ్యుదయరక్తిఁ గనిపించెఁ
బరమునందునె జయవాంఛఁ బెంచె
గీ. అక్షసూత్రపరిగ్రహమందె జనని
శత్రుభరణవ్యసనమును సంగతించె
ఒక్కటన నేల యాభూవరోత్తముండు
కేవలము మునివృత్తి నంగీకరించె. 119

గీ. ప్రతిదినముఁ బొద్దునన్ సందెపొద్దునందుఁ
గూర్మిసుతుదర్శనముఁ జేసికొనుచుఁ బడఁతి
తోడ శుకనాసుతోడ నాఱేఁడు దుఃఖ
ములను లెక్కింపకే కాలమును గమించె. 120

మ. అని జాబాలి యొకింత సెప్పి చిఱున వ్వాస్యంబునన్
దోఁప న। మ్మౌనులన్ జూచి వచించె నిట్లు హృదయ
మ్మున్ లాగు నేతత్కథా। ఘనసామర్థ్యముఁ గంటిరే
మఱచి వక్తవ్యం బనిదృగ్రిసం। బున నన్యంబు వచించు
కొంచు సమయంబున్ బుచ్చినా మెంతయున్. 121

శా. ఆకందర్పహతాత్మవృత్తి జడుఁడై నాపుండరీకుండె ధీ
సాకల్యంబున శౌకనాసియయి వైశంపాయనాఖ్యన్ మహీ
లోకంబందు జనించి వెండియు నటుల్ లోలాత్ముఁడై తం
డ్రిదా। శోకాక్రోశత హంసపుత్రినుడి నజ్ఞం డీశుకం
బయ్యెఁబో. 122

ఆ. ఇట్టు లమ్మహాత్ముఁ డెఱిఁగింప సుప్తోత్థి
తునకుఁబోలె నాకుఁ దొంటికళలు
విద్య లెల్ల మగుడ విచ్చేసె నాకృతి
శుకముఁగాని మంత్రిసుతుఁడ నైతి. 123

సీ. అదియె చంద్రాపీడునందు గాఢస్నేహ
మదె మహాశ్వేతామహానురక్తి
అదె కామపరత యయ్యదె హంసతనయాస
మాగమసంపద్యమానబుద్ధి
ఱెక్కలు రామిచే నక్కడి కరుగనే
గాని సర్వము మదిలోనఁ దోఁచెఁ
దలఁచుకొంటిని దల్లిదండ్రుల మఱియుఁ దా
రాపీడనరపతి రాణిగారి

గీ. మామకీనసఖుల్ రాకుమారుఁ దొంటి
చెలిఁ గపింజలు నలమహాశ్వేత సఖిని
ఒక్కఁ డనసేల పరిచయ మున్నవఱకు
సర్వము స్ఫురించె నాశుకజన్మమందె. 124

క. మది నన్నె మెఱుఁగఁ దలఁపుల్
గదుర ముని కెఱంగి మానికంఠీరవ ! నా
నదమదపాటుం గని యటు
హృదయభిదం గన్నమిత్రుఁ డెటఁ బుట్టెనొకో. 125

మ. భగవానుండ ! భవత్ప్రసాదమునఁ బూర్వజ్ఞానముం గల్గె
బం । దుగులుల్ నెయ్యురు గోచరింతురు మదిన్ దొల్లింట
మూధాత్మతల్ । వగ చేకూరదు గాని యిప్డు హృది భిన్నం
బౌనటుల్ తోఁచె మి । త్రగతిన్ జెప్పు మటన్ జరించు
నెడఁ దిర్యగ్జన్మమే నన్నెదన్. 126

క. నాపుడు నమ్మని మూర్ఖా !
యీవిధిఁ దిర్యక్కు వయ్యె నీతరళతఁ బోఁ
ద్రోవవు తెక్కులు రానీ
యావల నీవృత్త మెల్ల నడిగెదుగానీ. 127

వ. అని నన్ను సస్నేహశోకకుటిలంబుగాఁ జూచిన హారీతుం
డేతదుదంతశ్రవణకుతూహలియై తండ్రీ ! మునిజాతిలోఁ
బొడమిన నీతని కింతకా మేచ్ఛకుఁ గతం బేమి ? దివ్యలోక
సంజాతున కంతటి స్వల్పాయుష్యంబునకు నిమిత్త మేమి
యనిప్రశ్నింపుడు వత్సా ! వినుమని జాబాలి యిట్లు
వలికె. 128

సీ. కామరాగాదివికారాల్పసారమహా
స్త్రీవీర్యమునఁ బుట్టెఁ జెనఁటి యితఁడు
ఎట్టివారికిఁ బుట్టు నట్టిఁడే యగుపట్టి
యంచు వేదములె వాకొంచునుండెఁ
గారణగుణములు కార్యంబులందు సం
క్రాంతంబు లగుట లోకప్రసిద్ధి
తనరు నాయుర్వేదమునఁ గేవలాంగనా
వీర్యోద్భవుండు జీవింపఁ డనుచు
గీ. ఈతఁ డట్టిఁడ యాటఁ గా మెచ్చు హెచ్చు
దానికతననె యీతండు తనువుఁ బాసె
నిప్పటికి నల్ప యల్పాయు వితఁడు, శాప
మేగవలె నీతనికి మహాయోగ మొదవు. 129

గీ. అనుచు జాబాలి సలుదెస లరసి యేమి
యీకథారుచిచే రాత్రి యేగు టరయ
మదె శశి గతించె నగ్నివిహారవేళ
యయ్యె నని గోష్ఠి చాలించి యపుడు లేవ. 130

మ. మునిసంఘుంబుఁ గథాచమత్కృతికి నామోదించి స్వావా
సముల్ । జన హారీతుఁడు స్ఫోటజంబున ననుల్ శయ్యైక
దేశంబునన్ ।జన వాప్పారఁగ నుంచి కాల్యసదనుష్ఠానంబు
లై యేగ నే। మనమం దివ్విధిఁ జింతచేసితిని నామాథ్యం
బులై కుందుచున్. 131

సీ. బహుజన్మసుకృతపుణ్యపరిపాకమునఁగాని
సంభవింపదు నరజన్మ మవని

అఖిలజాత్యుత్కృష్ట మగుట బ్రాహ్మణ్య మం
దుంగూడ నత్యంతదుర్లభంబు
అందు విశిష్టమహా నాసన్ననిర్వాణ
మహితభాగ్యం బైనమానిపుట్టు
వందును దివ్యలోకాధివాసం బెంత
సుకృతంబు చేయువానికి లభించు

గీ. ఇట్టిపదమున నుండి నే నెట్టులైతి
సర్వకర్మాక్షమం బైనశౌకజన్మ
మాత్మదోషంబున నెగాదె యరుగుదెంచె
దీని విడనాడుటకు నేమి తెరవు నాకు? 132

గీ. పూర్వజన్మాప్తకోటితోఁ బొందు లేక
బ్రతికియు నిరర్థకంబెగా, పాడుమేను
వీడుదాన, మొదలనుండి వెతలె గూర్చు
విధిమనోరథమే ప్రభవిల్లుఁగాక. 133

వ. అని తలపోయునాకడకు హారీతుఁడు వెండియుఁ జనుదెంచి
యుల్లసితవదనంబుతోఁ దమ్ముఁడా! వైశంపాయనా! నీకై
భవజ్జనకపాదులపాదంబుల చెంతనుండి నీప్రియవయస్యుండు
కపింజలుం డేతెంచియున్నాఁడన నేనును దద్దర్శనోత్కంఠచే
నల్లేని మహాత్మా! నన్నటకుఁ గొనిపొమ్మని వేఁడుకొను
నంతలో నాచెంతక యేగుదెంచువాని. 134

గీ. నిస్పృహుం డయ్యు, మత్కార్యనిష్ఠు, వీత
రాగుఁ డయ్యును మత్ప్రియారంభరక్తు

సఖుఁ గపింజలుఁ బొడితు జడుఁడు వీరు
ననపయుఁ గృతజ్ఞు నకృతజ్ఞుఁ డట్లు గంటి. 135

క. కనుగొని నిర్భరవిగళిత
నయనపయస్కుండ నగుచు నామిత్రు నెదు
ర్కొన నెంతయుఁ బ్రయతించియుఁ
జనలేక విచారమంది సఖుతో నంటిన్. 136

మ. చెలికాఁడా! జననద్వయాంతరితు నిన్ శీఘ్రం బెదుర్కొం
చుఁ గౌఁగిలిఁ జేర్పన్, జనుదెంచితే యనుచుఁ గైఁగేల్పట్టి
యేతచ్ఛిలాతలిఁ గూర్చుండఁగఁ బెట్టఁ, బాదముల నొత్తన్
శక్తము గాని దుర్గలితంబౌ శుకజన్మ మొత్తితి మునీంద్రా!
యంచుఁ గన్నీ రిడన్. 137

గీ. ఆతఁడు మదీయదుఃఖాభిభూతుఁ డగుచుఁ
గేల నన్నుఁగొని యురమునఁ జాలసేపు
నిలిపికొని మచ్చరణములు తల ధరించి
యేడ్వఁ దొరకొన నతని కే నిట్టు లంటి. 138

ఉ. ఏల యిటు ల్విచారపడె దీగతి నేడ్వఁగ నీకుఁ జెల్లునే ?
బాలుఁడవయ్యు నీవు భవబంధముఁ ద్రించుటఁ జేసి మోక్షల
క్ష్మీలలితాంగి నిన్ను వలచె న్వడు మా నెత, తండ్రి సేమమా?
నాలఘువర్తనంబు వినెనా? విని యేమనియెన్ సుహృన్మణీ!

వ. నావుడుఁ గపింజలుం డిట్లనియె. వయస్యా ! పుండరీకా !
తాతపాదులకు సేమంబు. వారు దివ్యదృష్టిచేతనే భవ
దీయవృత్తం బెఱింగి తత్ప్రతిక్రియ నారంభించిరి.
తోడన యేను తురంగమత్వంబునుండి విముక్తుండనై

శ్రీవారి దర్శించి భవదీయచరిత్రం బడిగిన నాత్రికాల
వేది యిట్లనియె. వత్సా ! నీప్రియవయస్యుండు శుక
జన్మం బంది జాబాలియాశ్రమంబున నున్నవాఁడు. జన్మాం
తరసంస్కృతి వచ్చినది. నీ వాతనిఁ గనుఁగొనవచ్చును.
అతనికి నాయాశీస్సు లెఱింగించి యీప్రతిక్రియ పూర్తి
యగువఱకు నందే యుండుమంటి నని చెప్పు మనెను. భవ
జ్జనయిత్రి యగులక్ష్మియు మూర్ధాఘ్రాణపూర్వకముగా
నియ్యదియే చెప్పి పంపినది యని వాక్రుచ్చి తదీయగాత్రం
బు నిమురుచు దుఃఖితుండగు కపింజలునకు వెండియు నే
నిట్లంటి. 140

సీ. సోమపానోచితమై మించు నీమోము
కళ్లెంపుగాసి కెక్కరణి నోర్చెఁ
జిగురాకుసెజ్జకుఁ దగియెడునీవెన్ను
పట్టె పల్యాణ మెప్పగిదిఁ దాల్చె
లేఁదీఁగతాఁకులకే దూలునీయంగ
ము లెటు కశాఘాతముల సహించె
బ్రహ్మసూత్రంబుఁ దాల్పఁదగునీమే నెట్లు
టంగువాఱును దాల్చుటకుఁగడంగె
గీ. మందభాగ్యుండ నక్కటా ! యందఱికిని
బాధలఁ గూర్చుచుంటి నిప్పగిది నేను
ముక్తియోగ్యుఁడ వీ వశ్వమూర్తిఁ గొనుచు
సఖుఁడ ! నాకొఱ కిట్లగచాట్లఁ బడితె ? 141

గీ. అనుచు నొక్కింతతడవు తిర్యక్త్వచింత
మఱచి సుఖముండ హారీతమౌని మాకు
భోజనం బిడఁ దింటి మప్పుడు సఖుండు
నన్నుఁ గని యిట్టు లనియెఁ బ్రసన్నఫణితి. 142

ఉ. నెయ్యుఁడ! పోయివత్తు మది నిల్పుము కూరిమి నిన్నుఁ
దేర్పఁగా। నియ్యెడనే వసింపుమని యేర్పడఁజెప్పఁగఁ దండ్రి
పంచుటన్। జయ్యన వచ్చినాఁడఁ బని చాల నటన్గల
దేగువాఁడ మిా। యయ్యకు నమ్మ కేమయిన నంపుదు వే
కబు రన్న నావుడున్. 143

గీ. ఏమి కబురంపువాఁడ నే నిట్లొనర్చి
యన్నిటికి నీవ కలవు వయస్య! యనుచు
సెలవు గైకొని హారీతుచెంత నతఁడు
గగనమార్గంబుఁబట్టి యెక్కడికొ పోయె. 144

క. ఆరీతి మిత్రుఁ డరుగుడు
హారీతుఁడు నన్నుఁ గూర్మి నరయుచు వన్యా
హారములఁ బెంపఁ గ్రమముగఁ
దారాపథ మరుగుశక్తి తలకొనె నాకున్. 145

ఆ. ఎచటఁ బుట్టినాఁడొ యెఱుఁగఁ జంద్రాపీడుఁ
డందె యుండుఁగాదె హంసపుత్రి
యటకె యేగియుందు నని విహారపువంకఁ
జనితి నొక్కవేకువనె కడంగి. 146

ఉ. ఉత్తరదిక్కుగాఁ జనుచు నొక్కరవంతయె యేగి తెక్కలున్
గ్రొత్తవిమాటచే వగరుకొంచు శ్రమంబున, దప్పి చిత్త

మున్ । దత్తరపెట్ట నెందుఁ బడుదాననొ యంచుఁ బదేపదే
భయం । బెత్తఁగ నొక్కపూవుఁబొదరింటిపయిన్ బడితిన్
నదీతటిన్. 147

ఉ. అంతటఁ గొంతసేపటికి నధ్వపరిశ్రమమెల్లఁ బోవుదున్
స్వాంతము స్వస్థతన్ గనినఁ జల్లనినీరముఁ ద్రావి యొక్కె-
డన్ । బ్రాంతమహామహీరుహముపైఁ బవళింపఁగ నిద్ర
వట్టె న । త్యంతము, మేలుకాంచునరి కాభయదృశ్యము
నేమి చెప్పుదున్. 148

ఆ. బహుళపాశతతుల బంధింపఁగాఁబడి
కాయ మట్టునిట్టుఁ గదలరాదు
ఎదుట యమునకైన నెద భీతిఁగొలిపెడు
పరుషఁ డైనయొక్కపురుషుఁ డుండె. 149

వ. కటికవానికంటెం గఠినుం డగునవ్వానిం గనుగొన్నంతనే
ప్రాణంబులపైఁ ద్రాణంబుల విడి నే నిట్లంటి. 150

చ. ఎవఁడవు నీవు భద్ర ! నను నేటికిఁ బట్టితి మాంసతృష్ణ
లోఁ । దవిలిన నిద్దురన్ సదమదంపడఁజేయవదేల, యేమి
నీ । కవమతి చేసితిన్ విడువుమా యిది వేడుకకేనిఁ జేసి
యసీ । సవిధము పోవుచుంటి మది జాగు సహింప దనుగ్ర
హింపుమా. 151

ఆ. ఎంతొ దవ్వు గలదు గంతవ్యదేశంబు
నేను విరహమోర్వలేను బ్రాణి
ధర్మ మీా వెటింగెదవుగాదె మనుజుఁడ
వనుడు నాతఁ డిట్టు లనియె నాకు. 152

సీ. గుణవార్ధి! నే నొక్క క్రూరకర్ముఁడ జాతి
చండాలుఁడన నొప్పుచుండువాఁడ
మాంసాశ చేఁగాని మఱి కౌతుకము చేతఁ
గాని నిన్ బంధింపఁ బూనలేదు
ఇటకుఁ జేరువనె మా కేలిక తనరు నా
యన కొక్కగారాబుతనయ గలదు
ఆలలితాంగి జాబాలియాశ్రమమందు
వింతశుకం బున్నవిధ మెఱింగి
గీ. పట్టుకొని రాఁగఁ బల్వురఁ బనిచె మమ్ము
నాదుసుకృతంబుచేఁ జిక్కినావు నాకు
నిన్నుఁ గొని రాజసుతమ్రోల నిలుపువాఁడ
బంధమోక్షంబులకు నామె ప్రభ్వి నీకు. 153

క. నావుడుఁ దద్వాగశని మ
హావేదనఁ గొలుప నిట్టు లనుకొంటిని నా
భావమ్మున నత్తఱి దు
ర్భావుకమత్పూర్వకర్మపరిపాకంబున్. 154

మ. నిరతంబున్ సను రాసురాఖిలజగన్నిత్యార్చనీయాంఘ్రి కిం
దిరకున్ బుట్టియు శ్వేతకేతువుదయున్ దీపించియున్ వేల్పు
మేల్విరికిం దావగువాస మొప్పియుఁ గటా! మ్లేచ్ఛాళికిన్
దవ్వుగాఁ । బరిహార్యం బగు పక్కణంబుఁ జన నాఘాలంబు
నన్ వ్రాసెనే. 155

గీ. పుల్కసులతోడ నెటు లొక్కపొత్తు మనుదు
నెట్టు మాతంగకాంతల పెట్టు కాన

పడుదు నేలాగు చండాలబాలకులకుఁ
గటకటా! యాటవస్తువుగాఁగ నుందు. 156

ఉ. ఓరి దురాత్మ! యేటి కిటు లుద్భవమందితి పుండరీక! నీ
దారుణపాప మిట్లు ఫలితంబె? ప్రసూదరమందె మ్రగ్గలే
దేర, సవిత్రి! తండ్రి! నను నేలుఁడు వేగమ వచ్చి నావిప
త్తారసి ప్రోవవేనిఁ గనవయ్యెదు నన్ సఖుఁడా! కపింజలా!

మ. అని లోలోపలఁ గుళ్ళి వెండియును నే నవ్వాని కంటిన్
శుభా! నన! జాతిస్మరుఁడన్ మునిప్రవరుఁడన్ నన్నీమ
హాపాపమం! మన నేలా పడవేయఁగా నెవరు నిందున్
లేరు మీాత్రేనితో! నన, నీ కేటికి భీతి, వీడి ననుఁ బుణ్యాం
బందుమూా, నావుడున్. 158

గీ. అతఁడు చిఱునవ్వు నవ్వి మోహాంధ! నీదు
తనువునందునె పంచభూతములు లేవె
యవి శుభాశుభముల నారయువె యటంచు
ననుఁ గొనియెఁ దిన్నఁగాఁ బక్కణంబుఁ జేర. 159

గీ. శ్రుతివిరుద్ధంబు శిష్టగర్హిత మసభ్య
సంప్రచారం బసహ్యనీచప్రసంగ
సంగతము పాపశబ్ద మసంస్కృతమ్ము
మామకాపుణ్యమునఁ గంటి మాలపల్లె. 160

ఉ. ఘోరతరోరుపాపములకున్ గుదు రావెలివాడ దానిలో
దారులె యస్థిపుంజరచితంబులు కంచె కరంకకల్పితా
కారమ యింటిముంగిళులె ఖండితజంతువితానమాంసమే
దోరుణపంకిలంబులు భయంబగు దానిఁ దలంచినన్ మదిన్,

గీ. వేఁటలే యున్నతోద్యోగవిలసనములు
సారమేయౌఘమే పరివారకోటి
పశుబలులె ధర్మకర్మసంపదలు స్త్రీవ్య
సనమె మోక్షవిచార మచ్చటిజనులకు. 162

వ. నరకవాసులకును మహోద్వేగకరం బగు నప్పక్కణంబుఁ జొచ్చి నన్నా చండాలదారిక దూరంబునన గనుంగొని జాలిమై విడిచిపుచ్చునే. నాకింతటిభాగ్యంబు పట్టునా? లేనిచో నిముసమేని నిట నిల్వఁజాలనని లోన ననుకొనుచుండఁగనే యాచండాలుండు నన్నా పుల్కసపుత్త్రి కొసంగిన 'ఆ పుత్త్రికా! వచ్చితివా, యిప్పు డెచ్చటి కరిగెదవు. నీకామచారిత్వ మడంతు నిదే యని నన్ను దారుపంజరబద్ధముం జేసి యిందు సుఖం బుండుమని యూరకుండిన నేనును గటా! సంకటంబునఁ బడితిని. నీ యమకు నాకథ యెఱింగించి విడిచిపుచ్చఁ బ్రార్థించుటయు బంధనమునక చేయూఁత యొసంగు. అది కానిపనియ. 163

సీ. తొలుతనుండియు నాదుపలుకులకై మోజు
పడినయాసతి నన్ను విడుచు టెట్లు
నాబాధ యీమాలపూఁబోఁడి కేల నేఁ
బట్టినో తోడునో చుట్టమునొకా
మానంబుఁ బూనుటే మంచి దిప్పుడు దీన
విసిఁగి వీడిన నన్ను వీడవచ్చుఁ
జలపాది యయ్యె నీచిలుకయం చొకవేళ
నాగ్రహించిన నాకు నదియు మేలె

గీ. నరకనిభ మైనయీపక్కణంబునందు
వీరితో మనుకంటె మైవిడుటె లెస్స
యణఁతు వాగింద్రియం బదే యనఁగ నేల
నిఖలవిషయేంద్రియంబుల నిగ్రహింతు. 164

గీ. దేవలోకచ్యుతియు మర్త్యభావ మండ
జాతజననంబు చండాలజాతిహస్త
గతియుఁ బంజరవాసదుఃఖమును నాకు
ననియతేంద్రియతాదోష మగునుగాదె. 165

క. అని యెన్నుచు నాయమ పి
ల్చిన బెదరించినను నేమిచేసిన మానం
బును విడక యశనమేనియుఁ
గొనకయె దివసంబుఁ బుచ్చెఁ గోమలి యనియెన్. 166

గీ. చిలుక ! యాహార మన్నను జీత్కరింతు
వెన్నిదివసంబు లుపవాస మిట్లొనర్తు
తియ్యనిఫలంబు లియ్యవే తినుము చల్ల
నీర మిదె త్రావు మించె నాహారవేళ. 167

సీ. అనుమానపడదు విహంగమజాతి యాఁ
కలిఁ గొనునెడ నేమిగాని తినఁగ
జాతిస్మరుండవై చేతంబునందు భో
జ్యాభోజ్యశంక చేయంగ నేల ?
అట్టియుత్తముఁడవే యగుదుగాక విహంగ
భవమున నీ కి ద్దభక్ష్య మేమి ?

పాత్రంబు లేగడుకట్ల భక్ష్యాభక్ష్య
నియతిఁ జూడరు మహనీయులేని

గీ. పంచు లీజాతినుండియుఁ బడయఁదగును
జలము చండాలభాండసంస్థంబు భూగ
తము పవిత్రం బటంచుఁ బెద్దలు పచింత్రు
క్షుత్పిపాసల నీలాగు సుక్రక్క నేల. 168

గీ. ఆమె యువ్విధిఁ బల్కిన నప్పు డేను
తద్వివేకంబునకు నద్భుతంబు గలుగ
జీవితాపేక్ష భుక్తికిఁ జిత్త మొగ్గఁ
గాని మానంబుమాత్రంబు మాన లేదు. 169

చ. చన నిటు కొంతకాల మవిచారముగా నొకనాఁటివేకువన్
గనుఁగవ విప్పి చూచెదనుగా గనుఁగొంటిని హేమపంజరం
బున,నను నాదుమ్రోల సిరివోలె వెలింగెడు నీలతాంగి,నం
తన విడి మానమద్భుతము తన్వి! యిదేమని పల్కనంతలో.

గీ. నన్ను నీకిత్తి శ్రీవారిసన్నిధాన
మునకుఁ గొనివచ్చె నీయమ జనవరేణ్య!
ఈమె యెవ్వరో నన్నుఁ బట్ట నేమికతమొ
వినఁగ నీవలె నాకును వేడ్క గలదు. 171

వ. అని వైశంపాయనశుకంబు విరమించిన శూద్రకమహారాజు
ప్రతీహారిం బిలిచి యాచండాలదారికం దోడ్కొనిరా నియ
మించుడు నామెయుఁ దదానీతయై వచ్చి తనదీప్తిచే సభా
తలంబు వెలుంగ గంభీరముగా ఱేని కిట్లనియె. 172

శా. భువనాలంకృతి! రోహిణీపతి! జగత్పూజ్యప్రభావా!
మృగాంక! కళాధారా! స్ఫటికోపమానహృదయా! కాదం
బరీవల్లభా! । సవిశేషంబుగఁ జిల్కపల్కులనె యుష్మ
త్పూర్వజన్మస్థితుల్ । చెవికిన్ వచ్చెనుగాదె యే నితని
తల్లిన్ శ్రీయనన్ గ్రోలుదున్. 173

ఉ. ఈతనువందు నీతఁ డటులే ప్రియురాలిని జేరఁబోవుటల్
చేతమునం దెఱింగి మునిశేఖరుఁ డీతనితండ్రి యిమ్మహా
పాతకి యింక నేయధమభావముఁ గాంచునొ వీనిఁ గావు మ
బ్జాతనివాస! నాసలుపుశాంతికకర్మము సాగుదన్కనాన్.

గీ. ఏను జనములయొత్తిడి మానుకొఱకు
వీని కనుతాప మెద నొదవింప, మాల
కన్నెనై సతిదరి కేగుచున్నవీనిఁ
బట్టి, చెలి వని నీకడఁ బెట్టినాను. 175

శా. ఓపుణ్యాత్మకులార! ప్రోయెఁ దమశాపోత్తాపముల్ నీవు
చంద్రాపీడుండవు పుండరీకుఁ డితఁ డేతద్దేహముల్ వీడి మీ
మీపూర్వాకృతులన్ ధరించి మిము నెమ్మిన్ గోరు పూఁ
బోఁడులన్ । జేపట్టుండని యాపె మింటి కెగురన్ జిత్తం
బునన్ జేనికిన్. 176

గీ. వెనుకపుట్టువునందలివిషయ మెల్లఁ
దలఁపునకుఁ బాఱ గంధర్వతనయమీఁద
హత్తెఁ జిత్తంబు కామాగ్ని యధిక మయ్యెఁ
దాపమున మేను వోఁపుచందంబు దోఁచె. 177

క. కీరమును హంససుతపైఁ
నారాటంపడుచుఁ దప్త మగునత్తను వే
తీరున నేనియుఁ దాలుప
నేరక నిశ్చేష్ట మయ్యె నృపతివిధమునన్. 178

ఉ. ఆసమయంబునందు మలయానిలముల్ లతికాళి కెంతొ సం
తోసముఁగూర్చి నర్తనగతుల్ దెలుపన్ గలకంఠపాళి కు
ల్లాసము మీఱ గానకళలన్ గఱపన్ జనుదెంచె సౌఖ్యబా
భాసురవాసరం బతనువాసము సౌరభమాస మెంతయున్.

గీ. అపుడు కాదంబరీదేవి యవ్వసంతు
ధాక కెంతయు మనసు చీకాకుపడఁగ
స్నానమొనరించి దివసావసానమందుఁ
బుష్పశరమహామునఁ గాముఁ బూజ సలిపి. 180

వ. అక్కామదేవాభిముఖంబుగాఁ జంద్రాపీడుని. 181

సీ. శీతలసలిలంబుచే స్నానమొనరించి
తనువందు వలపుగందంబుఁ బూసి
కుంతలభరమందుఁ గుసుమమాలలు చుట్టి
కస్తూరితోఁ దిలకమ్ము వెట్టి
కంకేళిగుచ్ఛంబుఁ గర్ణపూర మొనర్చి
కర్పూరభూషణోత్కర మమర్చి
కుసుమరజంబుఁ జెక్కులపైన జల్లించి
పూల సింగారంబుఁ గీలుకొలిపి
గీ. ఏకతంబునఁ దమిఁ బట్టలేక చిత్ర
రథకుమారి మహాశ్వేతరాకఁ గనుచు

జీవితుం డట్లైనఁ గుతనచెల్వు కాని
గాఢరక్తిని గంఠంబుఁ గౌఁగిలించె. 182

గీ. అంత రాపట్టి కాకౌఁగిలింతవలనఁ
గ్రిమ్మరిన జీవితము కంఠగతము గాఁగ
మది శరజ్జ్యోత్స్నఁ గుముదంబుమాడ్కిఁ దనరె
విచ్చెఁ గన్నులు మోమున హెచ్చెఁ గాంతి. 183

మ. అలు సుప్తోత్థితునట్లు చేష్టితసమస్తాంగుండు రాపట్టి యు
త్కటరాగంబునఁ గంఠలగ్న యగునక్కాదంబరీకన్యకన్
దిటమౌ కౌఁగిటఁ జేర్చి పాసిచన నెంతేఁ జూచునక్కాంత క
న్పట్టిభీ మాన్పుచుఁ బల్కెఁ దాఁ బరిచితప్రాయస్వరం [బొప్పఁగన్.

సీ. భీరూ! మదిన్ వీడు భీతి జీవించితి
నింతి! నీబిగికౌఁగిలింతవలన
అమృతోద్భవం బగునప్సరఃకులమందు
నుదయంబుఁ గాంచినయువిద వీవు
స్మరియింతె? యీమేను స్వాయ మవినాశిమై
కాదంబరీస్పర్శఁ బ్రాలు ననుట
ఇన్నాళ్లు నీ వంటుచున్న జీవముఁ దాలు
పమికిఁ గారణము శాపమ్ము సుమ్ము

గీ. తీఱె నాశాప మిప్పు డోతీఁగెఁబోఁడి!
త్వద్విరహదుఃఖదాయి శూద్రకశరీర
ముజ్జగించితి నిఁక నీకు నిజ్జగంబుఁ
జంద్రలోకంబు సుఖ మీయఁజాలు నబల! 185

వ. నీప్రియవయస్య యగుమహాశ్వేతచే వాంఛితుండును నా
తోడన శాపవిముక్తుం డయ్యె నని చంద్రాపీడ శరీరాంత
రితుం డగుకుముదబాంధవుండు వలుకునంతలోన పుండరీకుఁ

డేకావళీకలితకంఠుండై కపింజలుకరంబుఁ గొని వచ్చినఁ గాదంబరి చంద్రాపీడువక్షంబు వీడి ప్రియవార్త మహాశ్వేత కెఱింగింపఁబోయెఁ బుండరీకుండును బరమోపకారి యగుచంద్రాపీడున కెఱఁగిన రావట్టి యతనిం గౌఁగిటం బట్టి పుండరీకా! నీవు నాకుఁ బ్రాగ్జన్మవశంబుచే నల్లుండవయ్యె ననంతరజన్మంబున నెచ్చెలి వగుటం జేసి సుహృద్ధర్మంబుతో ననుఁ బాయకయుండు మనుచుండఁ గనే యాయుదంతము చిత్రరథహంసుల కెఱింగింపఁ గేయూరకుండు హేమకూటంబునకును మదలేఖ తారాపీడు సమీపంబునకును జని రంత మదలేఖ తారాపీడుఁ దఱిసి.

క. మృత్యుంజయమంత్రజపం
బత్యున్నతిఁ జేయుతేని కనె నిటు విప్రుల్
సత్యాశీస్సులు నీయెడ
మృత్యువు నిర్జించి సుతుఁడు మేల్కానె నృపతీ! 187

గీ. అనుడు నరపతి కానుడి యమృతమట్లు
సంతసంబిడ మదలేఖ సత్కరించి
పయనమయ్యె నమాత్యదంపతులు గృహిణి
భూపనివహంబుఁ దోడరాఁ బుత్త్రకడకు. 188

ఉ. హెచ్చినభక్తి రాతనయుఁ డెప్పటియట్లెదు రేగి చెచ్చెరన్
వచ్చెడితల్లిదండ్రులకు వందనముం బొనరింపఁ బుత్త్రకున్
గ్రుచ్చి కవుంగిలించుకొని కూరిమి పేరెములాడఁ గౌతుకా
భ్యచ్ఛయమానసుం డగుచు భూపతి నందనుఁ జేరియిట్లనున్

గీ. నాదుభాగ్యంబుచే నేమి నీదుశాప
దోషమున నేమి నాకుఁ బుత్త్రుండవైన

దిక్పతివి నాదు తేజ మొందినఘనుఁడవు
రెండిటను వత్స! నాకె నమ్ముఁడ వీవు. 190

క. అని తారాపీడుఁడు రా
ద్తనయులతోఁ గొడుకునడుగుఁదామరలకు మ్రొ
క్కిన నవ్విలాసవతి పెం
చనవున సుతుఁ గౌఁగిలించి సంభావించెన్. 191

గీ. వ్రిభుసుతుం డంతమంత్రిదంపతుల కెఱఁగి
వారిదీవెన లంది యవ్వారి కెల్ల
లోకనుతుఁ డైనయప్పుండరీకుఁ జూపి
నుడివెను మనవైశంపాయనుం డటంచు. 192

వ. అంతఁ గపింజలుండు శుకనాసుసమీపించి యార్యునకు భగవానుం డగు శ్వేతకేతుసందేశంబు గల దవధరింపుఁడని యిట్లనియె. 193

క. పెనిచితి మీతని మే మో
యనఘా! యీపుండరీకుఁ డన నెవ్వండో
యనుకొనకుము వైశంపా
యనుఁడు భవత్సుతుఁడు కూర్మి నరయుము యితనిన్.

ఉ. ఈతఁడు శాపదోషమున నివ్విధి నొవ్వఁగఁ జేసెఁ గాని బల్
నీతి గలట్టివాఁ డితని నేరము గా దది పూర్వమట్లె యీ
నీతనయున్ వినీతుఁ గరుణింపుము నింపుము నెయ్య మమ్మహా
శ్వేతనిమిత్త మీతనువుఁ జేకొనె నీతఁడు నీదుపుత్త్రుఁడే?

గీ. అనవుడు వినమ్రుఁ డాపుత్త్రినంస మంటి
అట్లె యిష్టుఁడె మా కితఁ డనియె మంత్రి
అంత నవ్వారి విస్మయామోదంతములను
దెలియకే రేయి యంతలోఁ దెల్లవాఱె. 196

వ. అంతఁ బ్రభాతంబుననే చిత్రరథహంసులు మదిరాగౌరు
లతో గంధర్వులు గొలువ నయ్యెడ కేఁగుదెంచి లజ్జా
వనతు లగుతనయామణుల నవలోకించుచు ననురూప
లగునల్లుండ్ర నరయుచుఁ దారాపీడశుకనాసులతో ని
య్యంపుముచ్చటల నెఱపుచు మహానంద మనుభవించి
రపుడు చిత్రరథుండు తారాపీడు నవలోకించి రాజేంద్రా!

చ. భవనము లుత్తమంబు లతిభాసురముల్ మన కుండ నిమ్మ
హోత్సవము నరణ్యసీమ నిటు సల్పుట భావ్యమె యిద్ది
యిష్టమే । యవుత జగంబు మెచ్చవలదా పయనం బొన
రింపుఁ డిప్డె మీ । రవనికౌ మాజగంబునకౌ యాహరి
ణాంకునివీటికో యనక. 198

క. జననాథుఁడు గంధర్వ
శునితో నిట్లనియె శత్రుసూదన! నీ వె
ట్లనుకొందు వట్లసేయుము
మనమున సంశయము వలదు మా కదె హితమా. 199

గీ. భాసురానేకసంపదావాస మేని
వనము కా దద్ది దివ్యభవనము కాని
దుస్సహానేకదుఃఖనిర్ఘాత మేని
వనమ యౌ నది దివ్యభవనము యేని. 200

గీ. అదియునుంగాక నారాజ్య మఖిల మేను
నీదుజామాత కిచ్చితిఁ గాదె విపిన
వాసి నగునాకు నెటనేని వైభవంబె
యనుచుఁ జిత్రరథుం డల్లె యగుత మనుచు. 201

వ. చంద్రాపీడు నిజనివాసం బగు హేమకూటంబునకుఁ
దోడ్కొనిపోయి యొకశుభముహూర్తంబునఁ బుత్త్రికా

రత్నంబుతోఁబాటు నిజరాజ్యంబు సమర్పించిన హంసుఁ
డును బుండరీకునకు నట్టె తనయామణితోఁబాటు నిజై
శ్వర్య మర్పించె నంతఁ జంద్రాపీడపుండరీకు లభిమతవధూ
లాభంబున కమందానంద మొందిరి పదంపడి యొక్క
నాఁడు కాదంబరీదేవి శయ్యాగృహాగతుం డగుచంద్రా
పీడు నుద్దేశించి యార్యపుత్త్రా! 202

ఉ. అందఱ మున్ని కష్టముల కగ్గము లై యిపు డొక్కచోట నా
నందముతోడ నుంటిమి కనంబడ దెందును బత్త్రలేఖ నా
నిందుముఖీ! మదగ్ధ ముదయించినరోహిణి యాలతాంగి
యా। సుందరి నిందులోకమునఁ జూచెదు తెమ్మిఁక మంద [గామినీ!

క. వనజాక్షి! మరల శూద్రక
తనువున న న్నుపచరింప ధరణీతలిలో
జనియింప నెంచెఁ గానీ
మనమున నత్తలఁపు నేన మాన్పితి సుదతీ! 204

గీ. అనుడు రోహిణీపతిభక్తి కాత్మ నలరి
యూరకుండెను మదిరాకుమారి యంత
అరిగె రాట్సుతజన్మద్వయాభిలషిత
వల్లభాసుఖ మిడ నాఁగ వాసరంబు. 205

గీ. తత్క్షణం బనురాగపతాకవోలె
నపరసంధ్యావధూటీత్రపావరణము
కొఱకునాఁగ విభావరి గోచరించెఁ
గ్రమముగా నిందువెన్నెల గానిపించె. 206

వ. ఆసమయంబున 207

క. చిరకాలవాంఛితంబుఁ
నిరవధికబ్రహ్మసుఖకనిష్ఠముఁ గాదం

బరివృఢమసురత మన్వర
వరతనయుఁడు గాంచి హర్షవారిధిఁ దేలెన్. 208

మ. మదిరానందన సర్వసౌఖ్యముల సమ్మానింప నత్తాపురన్
బదినాళ్ళుల్ నిముసంబటుల్ గడపి భూపాలాత్మజుం డంత స
మ్మద మొప్పం బితృపాదుఁ జేరి నృపసామాన్యంబుఁ బూ
జించి కో । విదమాన్యుం డగుపుండరీకుపయిఁ బృథ్వీభార
మర్పించుచున్. 209

గీ. విషయసౌఖ్యంబులను రోసి విపినవాస
మిచ్ఛగించి సతముఁ బరమేశుఁ గొలుచు
పితరులకుఁ బరిచర్యఁ గావించుకొనుచు
నవసరంబేని రాజకార్యములఁ గనుచు. 210

సీ. నివసించు నొక్కప్డు నిఖిలపౌరులు గొల్వ
జనిభూమి యంచు నుజ్జయినియందు
మసలు నొక్కప్పుడు మామనెయ్యపుఁబిల్పు
పాటించి యా హేమకూటమందు
వర్తించు నొక్కప్డు వార్త నంపఁగ రోహి
ణీకంజముఖి చంద్రలోకమందు
ఉండు నొక్కప్పుడు పుండరీకునిమీఁది
సత్ప్రీతి నచ్ఛోదసరసు చెంత

ఆ. ఒకట ననఁగనేల వికచాంబుజాతాక్షి
కెచట మదికి నింపొ యచట నెల్లఁ
దరుణితోడ నృపతివరుఁడు చంద్రాపీడుఁ
డద్వితీయసౌఖ్య మనుభవించె. 211

వ. ఇవ్విధంబుగాఁ జంద్రాపీడుండు కాదంబరీదేవితోడను గాదం
బరి మహాశ్వేతతోడను మహాశ్వేత పుండరీకునితోడను

బుండరీకుండు చంద్రాపీడునితోడను క్షణంబేనియు నెడఁ
బాయక మహానంద మనుభవించుచుండిరి. 212

———:o:———

సీ. ఘనులు కావేరీజగన్నాథదంపతుల్
తల్లిదండ్రులుగ రాజిల్లువాఁడ
ధీమంతు లైనహనూమద్రఘూత్తము
లన్నదమ్ములుగాఁగ నలరువాఁడ
శ్రీవాజిముఖుఁడు కాశీకృష్ణసుకవియు
దైవంబు, గురుఁడుగాఁ దనరువాఁడ
సంగంబు గుంటూరు జన్మభూమి, నివాస
భూములుగా నోలిఁ బొలుచువాఁడ
గీ. వల్లెవంశోద్భవుఁడఁ బూర్ణప్రజ్ఞుఁ డనఁగఁ
బరఁగువాఁడను నేను శ్రీబాణతత్కు-
మారకాదంబరిని దెన్గు మార్చి యంకి
త మొనర్చితి మద్గురుదైవమునకు. 213

మ. తలయూఁచెన్ బుధమాళి దేశికుఁడు, మోదంబందె వై
దుష్యని ! స్తులుఁడౌ వేంకటశాస్త్రిసత్కవి, సదస్యుల్
మెచ్చి రెంతేనియున్, ! వెలయించెన్ నిను దండయా
ర్యుఁడు గుణోద్వేలుండు; మద్గ్రంథముల్ ! కల వెన్నో
సుకృతంబు నీయదియహో కాదంబరీ కావ్యమా! 214

క. భారతమటు ధర్మోన్నత
స్ఫారశ్రీకృష్ణనాయకమవై ఘనతన్
సారస్వతమహి నాశశి
తారము కాదంబరీ! సదా వెలయు మిఁకన్. 215

ఉ. అన్నము వెట్టి వస్త్రమిడి యక్షరవంతు నొనర్చి యాప
యిక । గన్నియ నిచ్చి జీవనముకై తగువృత్తిని జూపి
నెయ్యమొ।ప్ప న్ననుఁ గన్నమీ కడుతబ త్తిగ శిష్యుఁ డొ
సంగుచుండె భా । వోన్నత మీప్రబంధము గురూత్తమ !
దీనిఁ బరిగ్రహింపుమా. 216

క. వివిధప్రాంతసమాగత
నవనవవిద్యార్థినిచయనానా పాఠ
వ్యవసాయగమితకాలా !
యవధానకళాసమార్జితాఖండయశా !

ఉ. భూసురవంశముఖ్య ! కవిభూషణ ! వేలురుపట్టణోల్లస
ద్గోసమితీశ్వరానునయగుంఫితగోజననీప్రబంధ ! మే
ధాసురదేశికా ! హరికథాచణ ! చిత్రకళాప్రవీణ ! యా
ర్యా! సురభారతీసుకృతరాశికృతావతరా! గురూత్తమా!

శాలిని. సారాచారా ! సిద్ధసంకల్ప ! నిత్యో
దారా ! ధీరా ! సర్వతంత్రస్వతంత్రా !
కారుణ్యాబ్ధీ! దుష్టకవ్యద్రివజ్రా
కారా ! కృష్ణాచార్య ! కాశ్యన్వవాయా !

—* గద్యము. *—

ఇది కాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్త్ర సకల విద్వద్విధేయ
పూర్ణప్రజ్ఞనామధేయప్రణీతం బగునాంధ్రకాదంబరియం
దుత్తరార్ధంబున సర్వంబును నష్టమాశ్వాసము
సంపూర్ణము.

---

గుంటూరు, చంద్రికా ముద్రాశాలయందు ముద్రితము.